Photo by Madan Gopal



బహుమతి
పొందిన వ్యాఖ్య

చేటు లేని అంబారీ

పంపినవారు :
పి. బి. రాజు - విజయవాడ

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవిగాక చిత్ర కథ, ఫోటో శీర్షికల పోటీ, వార్తలు - విశేషాలు, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



ధైర్య శాలి
# రాము

డంబాల
# రంగా


































ఔను అది నిజం!
డాల్డా చాలా
బలాన్ని కలిగించే
విటమిన్ ఎ, డి, లను
గలిగి యున్నది.
ఇవి వ్యాధి నెదిర్చే
శక్తినిగలిగించి, పండ్లను
ఎముకలను దృఢపరచును.
అయితే, మీరు డాల్డాను
కొను నప్పుడు
డబ్బా మీద
ఖర్జూర చెట్టును
చూచుట
మరువకండి.




HVM. 306B-19 TL


DIAMOND NUT
OP & Co. C.B BELLARY
POWDER

# ఫ్లాష్ కెమేరాతో

## యింటివద్ద తీయగలరు



కోడక్ లిమిటెడ్ (ఇంగ్లండులో సంస్థాపితము; కంపెనీ సభ్యుల బాధ్యత పరిమితము) బొంబాయి - కలకత్తా - ఢిల్లీ - మద్రాసు

**'కోడక్' ఫిల్మునే వాడండి!**

మా పనితనమును
గురించి గొప్పగా
చెప్పటము కాదు

# అత్యుత్తమంగా

చేసి చూపుతాము

★

పోస్టర్లు
క్యాలెండర్లు
కార్టన్లు
లేబిల్సు
బుక్లెట్సు
ఫోల్డర్లు

అఫ్‌సెట్ ప్రింటింగులో ఏది కావలసినా సరే

మేలైన ముద్రణకు గుర్తు




## ప్రసాద్ ప్రాసెస్ (ప్రైవేట్) లి. మదరాసు - 26

బొంబాయి ప్రతినిధి కార్యాలయం :
లోటస్ హౌస్, మెరీన్ లైన్స్, బొంబాయి - 1.
ఫోన్ : 241162

# సెప్టెంబరు విడుదల!







సావిత్రి
గిరిజ + సూర్యకళ
జగ్గయ్య + గుమ్మడి
రమణారెడ్డి • పెరుమాళ్ళు
కుటుంబరావు • రామకోటి
వల్లం నరశింహారావు
నాగభూషణం .....
క్రొత్త నటుడు .......
రమణమూర్తి, B.Sc
• నటించిన

అనుపమ చిత్రం

# ఎం. ఎల్. ఏ

నిర్మాత • దర్శకుడు... తిలక్






RamDasik





MANNERS
GRIPE MIXTURE










# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

నమ్మకద్రోహంకంటె పాతకం లేదు. లౌకికవిషయాలకు అతీతుడుగా ఉన్నట్టు కనబడే మనిషికే ఎవరైనా తమ రహస్యాలను చెప్పటం జరుగుతుంది. ఇలా గొప్పవాడుగా నటిస్తూ ఒకరినుంచి తెలుసుకున్న రహస్యాలను మరొకరికి చెప్పేవాడు చాలా చెరుపు చేయగలుగుతాడు.

"నమ్మకద్రోహి" [జాతక కథ] లో కరంబియుడు నిజంగా గొప్పవాడుకాడు. కాని అతన్ని ప్రజలు గొప్ప విరాగిగా భావించారు. అతనికి గొప్పవారి మైత్రి లభించింది. పరస్పర శత్రువులైన సర్పరాజూ, గరుడరాజూ కూడా అతనికి మిత్రులయారు. వారి విశ్వాసాన్ని అంతగా సంపాదించుకున్న కరంబియుడు సర్పరాజు రహస్యాలను గరుడరాజుకు చెప్పి, సర్పకులానికి గొప్ప ప్రమాదం తెచ్చిపెట్టాడు. కాని సర్పాలకూ, గరుడులకూ మధ్య శాంతికుదిరిన మరుక్షణం కరంబియుడు తానుచేసిన మహాపాపానికి శిక్ష అనుభవించాడు.

సంపుటి 21 సెప్టెంబర్ 1957 సంచిక 3





# అట్టవిూది బొమ్మ

మర్నాడు తెల్లవారుతూనే కీచకుడు విరాటరాజు అంతఃపురానికి వచ్చి ద్రౌపదితో, "చూశావా ? ఈ మత్స్యదేశంలో నన్ను ఎదిరించేవారు లేరు. కనక ఇకనైనా మంచిగా నా కోరిక తీర్చు. నిన్ను నా పట్టపురాణిని చేస్తాను. నా భార్యలందరూ నీకు దాసీలుగా ఉంటారు!" అన్నాడు. "నీవు బలం గలవాడివి, నీకెవరి భయమూ లేదు. కాని ఈ సంగతి నా భర్తలైన గంధర్వులకు తెలిస్తే నాకు చాలా ప్రమాదం. ఇవాళ రాత్రికి నర్తనశాలకు వస్తివా, నేను నీకోసం అక్కడ వేచి వుంటాను. ఈ సంగతి మరెవరికీ తెలియరాదు," అన్నది ద్రౌపది.

కీచకుడిందుకు సంతోషంతో ఒప్పుకున్నాడు. ఈ ఏర్పాటును గురించి ద్రౌపది భీముడికి తెలిపింది. చీకటి పడగానే భీముడు వెళ్లి ఒంటరిగా నర్తన శాలలో శయ్యమీద దుప్పటి కప్పుకుని పడుకున్నాడు. అన్నప్రకారం కీచకుడు వచ్చి, చీకటిలో భీముణ్ణి చూసి సైరంధ్రే అనుకుని, మీద చెయ్యివేశాడు. వెంటనే భీముడు సింహంలాగా లేచాడు. ఆ అంధకారంలో ఇద్దరూ కొంచెంసేపు మద గజాలలాగా యుద్ధంచేశారు. చిట్టచివరకు భీముడు కీచకుణ్ణి చంపేసి, అతని కళేబరాన్ని గుర్తించరాకుండా భీభత్సపరిచాడు. తరవాత దివిటీకాంతిలో ఆ శవాన్ని ద్రౌపదికి చూపి, "నిన్ను మోహించిన దురాత్ముడికి ఏంగతి పట్టిందోచూడు!" అని చెప్పి, తన వంటశాలకు తిరిగివెళ్లాడు. తరవాత ద్రౌపది నర్తనశాలా రక్షకులను పిలిచి, "నా భర్తలైన గంధర్వులు కీచకుణ్ణి చిత్రవధ చేశారు. శవం నర్తనశాలలో ఉన్నది!" అని చెప్పింది. వాళ్లువెళ్లి ఈ సంగతి రాజభవనంలో చెప్పారు.

కీచకుడి మరణవార్త వినగానే నూటఅయిదుమంది ఉపకీచకులు వచ్చి, అక్కడే నిలబడిఉన్న ద్రౌపదిని చూసి, "దీనిమూలానే మన కీచకుడు చచ్చాడు. దీన్నికూడా ఆయనతోబాటు తగలేద్దాం!" అని ఆమెనుకూడా పాడెకు కట్టి శ్మశానానికి బయలుదేరారు. ద్రౌపది తన భర్తలను మారుపేర్లతో పిలిచి కేకలు పెట్టసాగింది. భీముడా కేకలు విని మారువేషంతో బయలుదేరి, దారిలో ఒక చెట్టు పెరికి దానితో ఉపకీచకులనందరినీ మట్టుపెట్టాడు.

దారిలో స్నానంచేసి సైరంధ్రి అంతఃపురానికి రాగానే రాణీసుధేష్ణ, "సైరంధ్రీ, నీ కొలువు ఇక చాలు! నీ భర్తలైన గంధర్వుల భయం మాకు జాస్తిగా ఉంది. నీవు వెళ్లిపో!" అన్నది. "అమ్మా, నాకు పదమూడు రోజులు గడువివ్వండి! తరవాత నాభర్తలువచ్చి నన్ను తీసుకుపోతారు!" అన్నది ద్రౌపది.

# పెద్దచేపను తిన్న చిన్నచేపలు

పూర్వం సముద్రరాజ్యాన్ని ఆరు పెద్ద చేపలు ఏలేవి. అందులో ఒక చేప పేరు ఆనందుడు. ఈ చేప నూరు యోజనాల నిడివిగలది. రోజూ ఇతర చేపలు ఆనందుణ్ణి చూడవచ్చేవి. తరవాత అన్ని చేపలూ కలిసి సముద్రం అడుగున ఉండే నాచుమొక్కలు తిని వెళ్లిపోయేవి.

ఒకనాడు ఆనందుడు నాచుమొక్కలు తింటూండగా నోట్లో ఏదో రుచిగా తగిలింది. బయటికి తీసిచూస్తే అదొక చిన్న చేప. ఆనాటినుండీ ఆనందుడికి ఇతర చేపలను తినాలన్న కాంక్ష కలిగింది. అందుచేత అది రోజూ తనను చూడటానికి వచ్చి ఇతర చేపలు వెళ్ళిపోయేటప్పుడు వెనకగావెళ్ళే చేపలను పట్టుకుని తినసాగింది.

ఈ రహస్యం చేపలకు తెలియదు. కాని ఒక యోగిచేపకు తమ సంఖ్య నానాటికీ తగ్గుతున్నట్టు తోచింది. ఒకనాడా చేప ఆనందుడి చెవిలో దాగి, తమరాజు వెనకపాటుగా చేపలను తినటం చూసి, ఈ సంగతి మిగిలిన చేపలకు చెప్పేసింది. అదిమొదలు మిగిలిన చేపలు ఆనందుణ్ణి చూడటానికి రాక, సముద్రం అడుగున ఉండే ఒక పర్వతంలోని గుహలో దాక్కున్నాయి.

తన రహస్యం ఇతర చేపలు కనుక్కున్నాయనీ, అవి ఫలాని కొండగుహలో దాగాయనీ ఆనందుడికి తెలిసింది. వెంటనే ఆ చేప ఆ కొండవద్దకు వెళ్ళి, అపారమైన తన శరీరంతో కొండను చుట్టసాగింది. అలాచేస్తే చేపలు బయటికి వస్తాయనీ, అప్పుడు వాటిని తినవచ్చునని ఆనందుడి ఉద్దేశం.

కొద్దిసేపట్లో ఆనందుడి శరీరం కొండను చుట్టింది. దాని తోక దాని తల సమీపానికి వచ్చింది. ఆ తోకను చూసి ఏదో చేప అనుకుని ఆనందుడు దాన్ని తన వాడిపళ్లతో కొరికింది. వెంటనే రక్తం వెలువడి నీటిలో కలియ నారంభించింది. అదే సమయంలో ఆనందుడికి భరించరాని బాధ పట్టుకున్నది.

జలమంతా రక్తమయం కావటం చూసి కొండలో దాగిన చేపలు గుంపులు గుంపులుగా వచ్చి, తెగిపోయిన ఆనందుడి తోకను భక్షించసాగాయి. శరీరం పెద్దదికావటంచేతా, బాధ మూలానా ఆనందుడికి ఆ చేపలను విదిలించుకోవటం చేతకాలేదు. కొద్దిసేపట్లోనే ఆ చేపలు ఆనందుడి శరీరమంతా పూర్తిగా తినేశాయి.






# నమ్మకద్రోహి

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో అయిదువందలమంది వర్తకులు ఒక నౌకలో సముద్రంమీద పోతూ ఉండగా, నడిసముద్రంలో నౌక మునిగిపోయింది. నౌకలో ఉన్నవారిలో ఒకడు తప్ప అందరూ చేపలకు ఎర అయారు. అందరూ చాపగా మిగిలినవాడు కరంబియ అనే సముద్ర తీర నగరాన్ని చేరుకుని తిండికోసమూ, బట్ట కోసమూ ముష్టిఎత్తసాగాడు.

అక్కడి ప్రజలు వాడి దుస్థితికి జాలి పడి సమస్తమైన వస్తువులు వాడికి ఇవ్వ బోయారు. "ఇవన్నీ నాకెందుకు? నాకింత బట్టా, తిండీ చాలు!" అని వాడు వారిచ్చిన వస్తువులను నిరాకరించాడు. ఇదిచూచి ప్రజలు, "ఓహో, ఇతడెవడో గొప్ప విరాగి, తపస్వి!" అనుకుని, అతని కొక పర్ణ శాల నిర్మించి, అందులో ఉంటూ తపస్సు చేసుకోమన్నారు.

అతను అందులో ఉంటూ, కరంబియ మహాముని అని పేరుపెట్టుకుని, ఎంతో గౌరవ ప్రతిపత్తులు సంపాదించుకున్నాడు. అతని దర్శనంకోసం రాజులుకూడా రాసాగారు. ఈ విధంగా కరంబియుడి స్నేహం సంపాదించినవారిలో పాములకు రాజైన పండరకుడూ, గరుడులకు రాజుగా జన్మించిన బోధిసత్వుడూ ఉన్నారు.

ఒకనాడు గరుడరాజు వచ్చి, కరంబి యుడికి ప్రణామం చేసి, పక్కనే కూచుని, "స్వామీ, మా గరుడులకూ పాములకూ యుద్ధం జరిగినప్పుడల్లా పాములకన్న గరుడులే ఎక్కువగా చావటం జరుగు తున్నది. మాకు పాములను ఎలా పట్టాలో తెలియటం లేదనుకుంటాను. ఇందులో ఏదో రహస్యం ఉన్నది. ఆ రహస్యం ఏమిటో మీరు పాములనుంచి తెలుసుకుని నాకు చెప్పగలరా?" అని అడిగాడు.



కరంబియుడు సరేనన్నాడు. గరుడరాజు వెళ్లిపోయాడు. తరవాత సర్పరాజు తనను చూడటానికి వచ్చినప్పుడు కరంబియుడు ఆయనతో, "రాజా, గరుడులు మిమ్మల్ని పట్టుకోగానే చచ్చిపోతాయట. దీనికేమిటి కారణం? ఎలా పట్టుకుంటే మీ సర్పాలు లొంగిపోతాయి?" అని అడిగాడు.

దీనికి సర్పరాజు వినయంగా జవాబిస్తూ, "స్వామీ, అది మా రహస్యం. నేను గనక ఈ రహస్యాన్ని బయట పెట్టానో నా జాతి కంతకూ ద్రోహం చేసినవాణ్ణి అవుతాను, జాతి వినాశనానికి కారకుడ నవుతాను! కనుక ఆసంగతి నన్నడగకండి," అన్నాడు.

"అదేమిటి? నేనీ రహస్యాన్ని మరొకరికి చెప్పేస్తానని నీవు నిజంగా శంకిస్తున్నావా? అలా ఎన్నటికీ జరగదు. నేను కేవలమూ ఆ రహస్యం ఏమిటో తెలుసుకుందామనే అడుగుతున్నాను. నాకు చెప్పినందువల్ల నీ జాతి కేమాత్రమూ నష్టం కలగదు," అని కరంబియుడన్నాడు.

సర్పరాజు కరంబియుడికి రహస్యం చెబుతానని మాట ఇచ్చి సెలవు పుచ్చుకున్నాడు. ఆయన తన దర్శనంకోసం మర్నాడు వచ్చినప్పుడు కరంబియుడు మళ్లీ అడిగాడు, కాని సర్పరాజు రహస్యం బయట పెట్టలేదు. ఆయన మూడవసారి వచ్చి






నప్పుడు కరంబియుడు, "ఇవాళ మూడవ సారి అడుగుతున్నాను. మీ రహస్యం చెప్పవు, కారణమేమిటి?" అని అడిగాడు.

దానికి సర్పరాజు, "స్వామీ, తమరు ఈ రహస్యాన్ని మరెవరికైనా చెప్పేస్తారేమోనని నాకు భయంగా ఉంది!" అన్నాడు.

"నేనలా ఎన్నటికీ చెప్పను. చెప్పనని ప్రమాణం చేస్తున్నాను!" అన్నాడు కరంబియుడు. ఆయన ప్రమాణం చేసిన మీదట సర్పరాజు తమ రహస్యాన్ని ఈ విధంగా బయటపెట్టాడు:

"మేము పెద్దపెద్ద రాళ్లను మింగి మా శరీరాలను బరువుగా చేసుకుని పడుకుని



వుంటాము. గరుడులు మామీదికి వచ్చినప్పుడు మేము నోళ్లు తెరుచుకుని వారి మీద కలియబడతాము. గరుడులు మా తలలను పట్టుకుని గాలిలోకి ఎగురుతారు. మా బరువులు మోయటంచేత వారి శరీరాలలో వుండే నీరంతా పైకి వచ్చేస్తుంది. వారు ఆ కారణంగా చచ్చిపోతారు. మూఢులైన ఆ గరుడులు మా తలలు పట్టుకోవటానికి బదులు మా తోకలు పట్టుకుని గాలిలోకి లేచినట్టయితే మేము మింగిన రాళ్లన్నీ కింద పడిపోతాయి, మా శరీరాలు తేలిక అవుతాయి, మమ్మల్ని వారు తన్నుకుపోగలుగుతారు. ఇదే మా రహస్యం!"

సర్పరాజు వెళ్లిపోగానే గరుడరాజు వచ్చి కరంబియుడితో, "స్వామీ, సర్పరాజు నుంచి పాముల రహస్యం తెలుసుకున్నారా?" అన్నాడు. కరంబియుడు సర్పరాజునుంచి తాను తెలుసుకున్న రహస్యం కాస్తా గరుడ రాజుకు చెప్పేశాడు.

"ఈ సర్పరాజు గొప్ప అపచారం చేశాడు. తన జాతి యావత్తూ నాశనం అయేటందుకు సహాయపడగల రహస్యాన్ని ఆయన మరొకరికి తెలియనిచ్చి వుండగూడదు. నే నిప్పుడే వెళ్లి ఆయనను పట్టుకుంటాను," అంటూ గరుడరాజు తన రెక్కలతో ఝంఝా





మారుతాన్ని లేపి, సర్పరాజు తోకను పట్టుకుని ఆకాశంలోకి ఎగిరాడు.

తలకిందుగా వేలాడుతున్న సర్పరాజు తాను మింగిన రాళ్ల నన్నిటినీ కక్కేశాడు. అయిన విచారంతో, "అయ్యో, నా నాశనాన్ని నేను కోరి చేతులారా తెచ్చుకున్నానుగదా! ఆ దుర్మార్గుడు మహాముని అని మోసపోయి, నా రహస్యం కాస్తా చెప్పేశాను," అని విలపించాడు.

ఇది విని గరుడరాజు, "మూర్ఖుడా, నీ రహస్యం ఆ దొంగసన్యాసికి చెప్పేసి ఇంకా ఎందుకు దుఃఖిస్తావు? చావు ఎవరికీ తప్పదు. కాని వివేకం మానవుడి ప్రధానధర్మం. నీ దుర్గతికి కారణం నేను కాను, సన్యాసీ కాడు, నీ అవివేకమే. ప్రాణికి తల్లిదండ్రుల కన్న ప్రేమపాత్రులుండరు; అలాటి తల్లిదండ్రులకుకూడా నీ రహస్యం చెప్పరాదు. అనేకమంది బంధువులూ, మిత్రులూ వుంటారు, రూపవతి అయిన భార్య వుంటుంది; వారికెవరికీ నీ రహస్యం తెలియనివ్వరాదు. ఆ విధంగా రహస్యం దాచగలిగినవాడే శత్రువును దూరంగా ఉంచగలుగుతాడు!" అన్నాడు.

"మహాత్మా, నీ హితబోధ గ్రహించాను. తల్లి తన బిడ్డపైన ఎలాటి కరుణ చూపు




తుందో నాపైన అలాటి కరుణ చూపు!" అని సర్పరాజు గరుడరాజును ప్రార్థించాడు.

"కొడుకులలో మూడు రకాలు; శిష్యులూ, పెంచినవారూ, గర్భవాసాన పుట్టినవారూ. అందులో నీవు నాకు శిష్యుడవు, కనక కొడుకువయావు. అందుచేత నీ ప్రాణాన్ని కాపాడుతున్నాను!" అంటూ గరుడరాజు సర్పరాజును నేలమీదికి దించి వదలిపెట్టాడు.

సర్పరాజు నాగలోకానికి వెళ్లాడు. గరుడరాజు తన లోకానికి వెళ్లి గరుడులతో, "సర్పరాజైన పండరకుణ్ణి మిత్రుడుగా చేసుకున్నాను. కాని అతనికి నాపట్ల ఎలాటి

భావం ఉన్నదో పరీక్షించవలసి వున్నది," అని చెప్పి, నాగలోకానికి వెళ్లి తన రెక్కలతో మళ్లీ ఝంఝామారుతం లేపాడు. వెంటనే సర్పరాజు రాళ్లూ, ఇసుకా మింగి, తేక కస పడకుండా చుట్టచుట్టుకుని నేలపై పడు కుని, నోరు తెరిచి బుసకొట్టసాగాడు.

అప్పుడు గరుడరాజు, "ఇదేమి, సర్ప రాజా ? మనం సంధీ స్నేహమూ చేసు కొంటిమిగదా, మళ్లీ నన్ను చంపటానికి సిద్ధ పడుతున్నావేమిటి ?" అని అడిగాడు.

దానికి సర్పరాజు, "మిత్రమా, వివేకి అయినవాడు ఎవరినీ నమ్మరాదు ! అందులో, నిన్నటివరకూ శత్రువుగా ఉండిన నిన్ను ఎలా నమ్మను ?" అన్నాడు.

గరుడరాజు నవ్వి, "నాపాఠం నాకు బాగానే వప్పగించావు ! పద, ఆ దొంగసన్యా సిని చూసి వస్తాం !" అన్నాడు.

ఇద్దరూ కలిసి కరంబియుడి పర్ణశాలకు వెళ్లారు. సర్పరాజు కరంబియుణ్ణి చూసి, "నిన్ను చూసి గొప్ప మునివనుకుని నా రహస్యం చెబితే, దాన్ని గరుడరాజుకు చెప్పి ఎందుకు నమ్మకద్రోహం చేశావు ?" అని అడిగాడు.

"నేను అజ్ఞానంచేత ఆ పని చెయ్యలేదు. మీరిద్దరూ నాకు మిత్రులే అయినప్పటికీ నాకు గరుడరాజుపైన అభిమానం జాస్తి. అందుచేత నీ రహస్యం గరుడరాజుకు చెప్పే శాను !" అన్నాడు కరంబియుడు.

"ఛీ, నీచుడా ! సర్వసంగాలనూ పరిత్య జించికూడా పక్షపాతబుద్ధీ, శత్రుమిత్ర భావమూ పోని నీవుకూడా ఒక మునివేనా ? లోకాన్ని ఈ విధంగా వంచిస్తున్నందుకు నీ శిరస్సు ఏడు చెక్కలగుగాక !" అని సర్ప రాజు కరంబియుణ్ణి శపించాడు.

మరుక్షణమే కరంబియుడు శిరస్సు ఏడు చెక్కలయింది. అతనికింద భూమి విచ్చు కున్నది. అతను నేరుగా అవీచీనరకానికి దిగిపోయాడు.






9

[మహామాయుడినుంచి పింగళుడు అద్భుతశక్తులు గల వస్తువులన్నిటినీ హరించగానే, భల్లూకపర్వతాలమీద గల దుష్టశక్తులన్నీ విజృంభించినై. పద్మపాదుడు భల్లూకకేతుడి కోసం పింగళుణ్ణి పంపాడు. పింగళుడు భల్లూకకేతుణ్ణి తీసుకువచ్చాడు. అప్పుడు పిశాచాలన్నీ భల్లూకకేతుడు వున్నచోటుకు పరిగెత్తుకు రాసాగాయి. తరవాత—]

తమవద్దకు పరిగెత్తుకువస్తున్న పిశాచాలను చూసి, పద్మపాదుడు చిరునవ్వు నవ్వాడు. భల్లూకకేతుడుమాత్రం వాటికేసి చూసి, అయిష్టంగా తల పక్కకు తిప్పి, పింగళుడికి నమస్కరిస్తూ, "ప్రభో, ఈ క్షుద్రజీవాలకు నేను నాయకుడుగా వుండలేను. దయవుంచి నన్ను మీ వెంట తీసుకుపొండి!" అన్నాడు.

పింగళుడు జవాబేమీ చెప్పలేదు. అప్పుడు పద్మపాదుడు, భల్లూకకేతుడి భుజం తడుతూ, "భల్లూకకేతా! నువ్వు ఈ పర్వతప్రాంతాల, ఈ రక్కసిగణానికి నాయకత్వం వహించి బతకటమే అన్ని విధాలా మంచిదని నా అభిప్రాయం!" అన్నాడు.

"అయ్యో, ప్రభో! ఆ జీవితం ఇక నాకు వద్దు!" అంటూ భల్లూకకేతుడు, పద్మపాదుడికి సాష్టాంగ ప్రణామం చేశాడు.

అంతలో పిశాచాలన్నీ వారిని చుట్టుముట్టి, "భల్లూకకేతా, మారాజా! ఓహెూం! ఓహెూం!" అంటూ అరవసాగాయి. కర్ణకఠోరంగా వున్న వాటి వికృతనాదాలను విని, పింగళుడు చీదరించుకుంటూ, "పద్మ



పాదా! నాకు ఒక మంచి వుపాయం తోస్తున్నది. అలా చేస్తే, అటు భల్లూక కేతుడికీ, మనకూకూడా అన్ని సమస్యలూ విరగడవుతవి!" అన్నాడు.

"ఏమిటదీ?" అన్నాడు పద్మపాదుడు.

"భల్లూకకేతుడికి మనను సేవిస్తూ బతకాలని వుంది. ఆ కారణంవల్ల అతడు ఈ పిశాచాలకు నాయకుడుగా, ఈ పర్వత ప్రాంతాల వుండేందుకు అంగీకరించటం లేదు. మనం ఈ పిశాచాలను ఇలాగే వదలి పోతే, అవి ఎలాంటి అఘాయిత్యాలు చేస్తవో మనకు తెలీదు. అందువల్ల వీటిని దుంప నాశనంచేయటమే మంచిది. వీటిమీద మహామాయుడి కత్తిని వుపయోగిద్దాం!" అన్నాడు పింగళుడు.

పింగళుడు ఇలా అనేసరికి, పిశాచాలన్నీ హాహాకారాలు చేసినై. అవన్నీ ఏకకంఠంతో, "మహామాంత్రికులారా! మమ్మల్ని సర్వ నాశనం చేయకండి. మా ప్రభువు భల్లూక కేతుడు మాకు నాయకత్వం వహించకపోతే, మేమే నాయకుణ్ణి ఎన్నుకోగలం!" అన్నవి.

"అందుకు నా అభ్యంతరం ఏమీలేదు. మీరు నాయకత్వపు సమస్యను ఎలా పరిష్క రించుకోగలరో చూడాలని నాకు కుతూ హలంగా వుంది," అన్నాడు పద్మపాదుడు.

"మీ మానవుల్లోలాగానే మాలోనూ బల దర్పాలు గలవాడే నాయకుడు! ఆ శక్తులు ఎవరిలో ఎక్కువగా వున్నవో రుజువు చేసు కుంటాం!" అంటూ పిశాచాలన్నీ బాహాబాహి, ముష్టాముష్టి యుద్ధానికి వుపక్రమించినై.

"భేష్, ఈ పద్ధతి చాలా బావుంది!" అంటూ పింగళుడు ఎంతో వుత్సాహంగా చప్పట్లు చరిచాడు.

ఇక పిశాచాలు నాయకత్వంకోసం పోరు ప్రారంభించినై. అవి క్షణక్షణానికీ అనేక రూపాలను ధరిస్తూ యుద్ధం సాగించినై. పులిరూపం దాల్చిన వాటిని మట్టుపెట్టేం దుకు కొన్ని ఏనుగురూపాలు ధరిస్తే, వాటిని



హతమార్చేందుకు మరికొన్ని పిశాచాలు సింహాకృతులు ధరించినై. కొన్ని నాగుబాములైతే, మరికొన్ని గరుడపక్షులు !

ఈ విధంగా జరిగిన ఘోరసంగ్రామంలో చావగా మిగిలిన కొద్ది పిశాచాలు, చివరకు తమ నాయకుడుగా ఒక పెనుభూతాన్ని ఎన్నుకున్నవి. పద్మపాదుడికి, యీ విధంగా నాయకత్వపు సమస్య పరిష్కారమయినందుకు చాలా సంతోషం కలిగింది. అతడు, యిప్పుడు పిశాచాల నాయకుడైన పెనుభూతాన్ని దీవించి, "యిక మీరు స్వేచ్ఛగా, యీ భల్లూక పర్వతాలలో బతకవచ్చు. మీరు అహంకరించి మానవులమీద కత్తి కట్టితే తప్ప లేకపోతే మీ జోలికి నేనుగాని, పింగళుడుగాని రామని అభయహస్తమిస్తున్నాను. యిక వెళ్లండి!" అన్నాడు.

పిశాచాలన్నీ జయజయధ్వానాలు చేస్తూ, తమ కొత్త నాయకుడైన పెనుభూతాన్ని భుజాలమీద ఎక్కించుకుని పర్వతాల మీదికి వెళ్లిపోయినై. అప్పుడు పద్మపాదుడు, పింగళుడికేసి తిరిగి, "పింగళా! మనం అష్టకష్టాల కోర్చి, కావలసిన శక్తులన్నిటినీ సంపాదించుకొన్నాం. యిందులో నీవు చేసిన సహాయం నే నెన్నడూ మరువరానిది. నీవు నీ యింటికి వెళ్లేముందు, నాకు కొద్ది



రోజులపాటు అతిథిగా వుండవలసిందని కోరుతున్నాను," అన్నాడు.

పింగళుడు అందుకు అంగీకరించాడు. పద్మపాదుడు ఓ చిటికెడు మన్ను తీసుకుని మంత్రించి భూమిమీద చల్లాడు. వెంటనే ఓండ్రిస్తూ పిశాచగార్దభాలు పెళపెళా రావాలతో భూమిలోంచి బయటికి దూకినై.

పద్మపాదుడు ఒక పిశాచగార్దభాన్ని ఎక్కి కూర్చున్నాడు. పింగళుడు రెండవ గార్దభం దగ్గిరకు వెళ్లబోయేంతలో, భల్లూకకేతుడు అతడిముందు మోకరిల్లి, "ప్రభో! మీరు నా భుజాలమీద ఎక్కండి. నేను మీకు సదా సేవకుణ్ణి!" అన్నాడు.

పింగళుడు నవ్వుతూ, భల్లూకకేతుడి భుజాలమీద ఎక్కి కూర్చున్నాడు. పద్మపాదుడు కూర్చున్న గార్దభం గాలిలోకి లేచింది. ఆ వెంటనే భల్లూకకేతుడుకూడా గాలిలోకి ఎగిరాడు. రౌతులేని రెండవ పిశాచ గార్దభం వారివెంట ఎగిరి రాసాగింది.

అడవులూ, కొండలూ, నదులూ దాటుతూ సూర్యాస్తమయం వేళకు వారు ఒకానొక నగరం సమీపించారు. పద్మపాదుడు కింద బొమ్మరిళ్లలా వున్న ఆ నగర భవనాలను పింగళుడికి పేరుపేరునా చూపిస్తూ, "ఆ కొండపక్కన పాములా కదులుతున్న సెలయేరు కనబడుతున్నదిగదా? దానివెంట వున్న ఆ చెట్లగుంపు చూడు! అందులో పాలరాతితో నిగనిగలాడుతున్నదే, నా పిత్రుగృహం! నా అన్నలిద్దరూ చిలకసరస్సుకు ఆహుతి అయిపోయారు గనక, యిప్పుడు నేనే ఆ గృహానికి అధిపతిని. నా తండ్రి వదిలిపోయిన మంత్రగ్రంథంకూడా నాదే!" అన్నాడు వుత్సాహంగా.

అంతలో పద్మపాదుడు ఎక్కివున్న పిశాచగార్దభం క్రమంగా కిందకు దిగి ఎత్తయిన ప్రాకారం గల పద్మపాదుడి యింటిముందు ఆగింది. భల్లూకకేతుడుకూడా కిందికి దిగాడు. ప్రాకారద్వారానికి గల పెద్ద యినప తలుపులముందు, యిద్దరు నీగ్రో



బానిసలు పహరా తిరుగుతున్నారు. వారు పద్మపాదుణ్ణి చూస్తూనే, తమ చేతుల్లో గల శూలాలను పైకెత్తి, "జై పద్మపాదా!" అంటూ జయజయధ్వానాలు చేశారు.

పద్మపాదుడు గార్దభంమీంచి దిగి ముందు దారితీశాడు. పింగళుడుకూడా, భల్లూకకేతుడి భుజాలమీంచి కిందకు దూకి అతణ్ణి అనుసరించాడు. అందరూ భవనం ముందు గల చిత్రవిచిత్రమైన చెట్లలోంచి నడుస్తూ, భవనాన్ని సమీపించేసరికి, మెట్ల వద్ద తెల్లని బారెడు గడ్డంతో వున్న ఒక వృద్ధుడు ఎదురయ్యాడు. పద్మపాదుడు అతణ్ణి చూస్తూనే వంగి ప్రణామంచేసి, వెను దిరిగి పింగళుడితో, "వీరే మా తండ్రి గురువులు!" అన్నాడు. పింగళుడుకూడా అయనకు నమస్కరించాడు.

వృద్ధుడు అందరూ సమీపించేవరకూ ఆగి, తరవాత పింగళుడికేసి వేలుచూపుతూ, "పద్మపాదా! యీ యువకుడెవరు?" అంటూ ఆగి, "అవంతీనగరపు జాలరి కాదుగదా?" అన్నాడు.

పద్మపాదుడు అవునన్నట్టు తల వూపాడు. వెంటనే వృద్ధుడు పరమానందం పొంది, "అయితే, నువ్వు మహామాయుడి సమాధిలో గల అపూర్వ శక్తులనన్నిటినీ వశపరుచుకున్నావన్నమాట!" అన్నాడు.





పద్మపాదుడు మారుమాటాడకుండా, తన వేలిన గల వుంగరాన్నీ, వజ్రాలు తాపిన పిడి గల కత్తినీ, భూగోళాన్నీ వృద్ధుడికి చూపించాడు. వృద్ధుడు వాటిని కొంచెంసేపు పరీక్షగా చూసి, "పద్మపాదా! ఇక నిన్ను జయించ గల మాంత్రికుడు ఈ ప్రపంచంలో మరొకడు లేడు. నీ తండ్రి ఎంతో ప్రయత్నించి కూడా సాధించలేకపోయిన వాటిని నువ్వు సాధించావు. ఆ విధంగా అతడి ఆత్మకు శాంతి కలుగుతుంది!" అన్నాడు.

"నా తండ్రి వదిలిపోయిన మంత్ర గ్రంథం యిప్పుడు నాదేగదా?" అన్నాడు పద్మపాదుడు.



వృద్ధుడు చిరునవ్వు నవ్వి, "ప్రపంచాన్నే జయించ గల సర్వశక్తులూ నీ స్వాధీనం అయిన తరవాత, ఆ మంత్రగ్రంథంతో నీకు కొత్తగా జరగబోయే మేలు ఏమున్నది? నీవు సంపాయించిన శక్తులకన్న, అందులో గొప్ప శక్తులేమీ లేవు. తను సాధించలేకపోయిన వాటిని తన కొడుకులచేత సాధింపచేయాలనే, నీ తండ్రి మరణించే ముందు, ఆ మంత్రగ్రంథాన్ని గురించి అలాంటి షరతులు పెట్టాడు. మహామాయుడు నీ తండ్రికి ప్రబల విరోధి! నువ్వు అతణ్ణి జయించావు," అన్నాడు వృద్ధుడు.

వృద్ధుడు అంత చెప్పిన తరవాత గాని, పద్మపాదుడికి తన తండ్రి అభిప్రాయం ఏమిటో అర్థం కాలేదు. తనకు ప్రబల విరోధి అయిన మహామాయుణ్ణి, శక్తిహీనుణ్ణి చేసేందుకు ఆయన తనను వుపయోగించుకున్నాడన్నమాట!

పద్మపాదుడు ఇలాంటి ఆలోచనలతో సతమతమవుతూండగా, వృద్ధుడు, పింగళుడి భుజాన్ని ఆప్యాయంగా తడుతూ, "అవంతినగరపు జాలరివైన నువ్వు, విధి ప్రేరణవల్ల, పద్మపాదుడికి తటస్థపడి— మహత్కార్యాన్ని సాధించావు. ఇందుకు నేను నిన్ను అభినందిస్తున్నాను," అన్నాడు.



పింగళుడు వారంరోజులపాటు పద్మపాదుడికి అతిథిగావుండి తిరుగు ప్రయాణానికి సిద్ధమయాడు. పద్మపాదుడు అతడికి విలువైన దుస్తులతోపాటు, చాలా బంగారమూ, రత్నాలూ, మణులూ బహూకరించాడు. పింగళుడు వాటినన్నిటినీ ఎంతో కృతజ్ఞత కనబరుస్తూ స్వీకరించాడు.

తీరా పింగళుడు యింటి ప్రాకారాపు ద్వారాలు దాటి బయటికి వచ్చింతరవాత, పద్మపాదుడు అతడికి, మహామాయుడి సమాధినుంచి తెచ్చిన వస్తువులన్నీ చూపెడుతూ, "పింగళా! వీటిలో నీకు కావాలన్న ఏ ఒకటైనా సంతోషంగా యిచ్చివేస్తాను, తీసుకో!" అన్నాడు.



పింగళుడు అందుకు అంగీకరించలేదు. అతడు చిరునవ్వు నవ్వుతూ, "పద్మపాదా! ఆ మహాశక్తిసంపన్నమైన వస్తువులు, జాలరినైన నాదగ్గిరకన్న, మంత్రవేత్తవయిన నీ దగ్గిరే ఎంతో రాణిస్తవి. మరోలా అనుకోకపోతే, నేను కోరదలిచిన వస్తువు నీదగ్గిర ఒకటి వున్నది," అన్నాడు.

"ఏమిటదీ? నిరభ్యంతరంగా కోరుకో, యిచ్చేస్తాను!" అన్నాడు పద్మపాదుడు.

"నీదగ్గిర మహత్తుగల సంచీ ఒకటి వున్నదిగదా? వంటచేసే బాధ లేకుండా సకల పదార్థాలూ అందులో దొరుకుతవి! అలాంటి వస్తువు నాదగ్గిర వుంటే, వృద్ధురాలైన నా తల్లికి రోజూ వంట చేయవలసిన బాధ తప్పి, ఎంతో సంతోషిస్తుంది," అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు, పింగళుడు కోరిన విధంగా ఆ సంచిని ఇచ్చేశాడు. తరవాత పింగళుడు వృద్ధ మంత్రవేత్తకూ, పద్మపాదుడికీ వీడ్కోలు చెప్పి, భల్లూకకేతుడి భుజాలమీద కూర్చుని ఆకాశమార్గాన బయలుదేరాడు.

భల్లూకకేతుడు దట్టంగా మేఘాలతో కప్పబడిన ఆకాశమార్గాన ఎగురుతూ, సరిగా మిట్టమధ్యాహ్నం వేళకు అవంతీనగర





పరిసరాలను చేరాడు. పింగళుడు, ఆ నగరాన్నీ, ఆ నగరం పొలిమేరలలో వున్న తన పూరిగుడిసెనూ చూస్తూనే, ఉలిక్కిపడి భల్లూకకేతుడి భుజం తట్టి, "భల్లూకా! నువ్వు యిక ముందుకు సాగకుండా, ఆ దిగువ కనుపిస్తున్న చెట్లమధ్యకు దిగు!" అన్నాడు ఆదుర్దాగా.

భల్లూకకేతుడు, పింగళుడు కోరిన విధంగా, అవంతీనగర పొలిమేరలలో వున్న ఒకానొక చెట్లగుంపుమధ్య దిగాడు. పింగళుడు అతడి భుజంమీంచి దిగి నగరంకేసి చూస్తూ, "భల్లూకా! నిన్ను యీ రూపంలో నగరంలోకి తీసుకపోవటం, అనేక చిక్కులకు కారణం కాగలదు. యిప్పుడేం దారి?" అన్నాడు నిస్పృహగా.

పింగళుడి భయానికి కారణం ఏమిటో గ్రహించిన భల్లూకకేతుడు పెద్దగా నవ్వి, "ప్రభో! అయితే మీరు ఒంటరిగానే నగరంలోకి వెళ్లండి. నా సహాయం కావలసి వచ్చినప్పుడు, యీ మంత్రం పఠించండి! వెంటనే నేను మీ సాన్నిధ్యంలో వుంటాను," అంటూ ఏదో మంత్రం పింగళుడి చెవిలో చెప్పి, అదృశ్యుడయాడు.

పింగళుడు, పద్మపాదుడు యిచ్చిన ధనరాసుల్ని మోసుకుంటూ తన యింటివైపుకు నడిచాడు. అతడు కొంతసేపు తరవాత యింటిని సమీపించేసరికి, చిక్కిశల్యమైపోయిన స్థితిలో వున్న అతడి తల్లి, వాకిట్లో కూర్చుని నీరసపడిన గొంతుతో, "అయ్యా! ధర్మదాతలు, యీ ముసలిదానికి ఏమైనా ధర్మంచెయ్యండి. ఆకటితో అలమటిస్తున్నాను!" అంటూ దీనాతిదీనంగా చేతులు చాచటం, అతడి కంటబడింది.

పింగళుడు ఆ దృశ్యాన్ని చూస్తూనే నిలువెల్లా వణికిపోయి, వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ, "అమ్మా! నీకు యీ దుస్థితి ఎలా కలిగింది!" అంటూ తల్లికేసి పరిగెత్తాడు. (ఇంకా వుంది)





# బెస్తవాడి అదృష్టం

[ గత సంచిక తరువాయి ]

అసలు ఖలీఫా గుర్రంమీద దగ్గరకువచ్చి తనను పలకరించేసరికి బెస్తవాడు రుసరుసలాడుతూ ఏదో గొణిగాడు.

"తాగటానికి కాసిని మంచినీళ్లివ్వగలవా?" అని అసలు ఖలీఫా అడిగాడు.

"నీకు పిచ్చా, లేక కళ్లు లేవా? ఈ దిబ్బ వెనకగా ప్రవహించేది టిగ్రిస్ కాదూ?" అన్నాడు బెస్తవాడు. ఖలీఫా తన గుర్రంతోసహా దిబ్బను చుట్టి వెళ్లి అక్కడ నది పారుతున్న సంగతి తెలుసుకున్నాడు. ఆయన తన గుర్రానికి నీళ్లు పెట్టి తన దప్పి తీర్చుకుని బెస్తవాడివద్దకు తిరిగివచ్చి, "తమ్ముడూ, నువ్విక్కడ ఏం చేస్తున్నావు? నీవృత్తి ఏమిటి?" అన్నాడు.

"అది బొత్తిగా అర్థంలేని ప్రశ్న. నేను వంటికి చుట్టుకున్నదాన్నిబట్టి నా వృత్తి గ్రహించలేవూ?" అన్నాడు బెస్తవాడు.

"ఓహో, నువు బెస్తవాడివా? అయితే నీ బట్టలేవీ?" అని అడిగాడు ఖలీఫా.

ఆయన ఆ మాట అడగటంతో, ఆయన తన దుస్తులు కాజేసి ఉంటాడని బెస్తవాడికి అనుమానం తోచింది. వాడు ఒక్క దూకున ముందుకు వచ్చి, ఖలీఫా గుర్రం కళ్ళెములు పట్టుకుని, "నీ హాస్యం చాలించి నా బట్టలు నాకిచ్చెయ్యి!" అని అరిచాడు.

"అల్లా సాక్షిగా, నేను నీ బట్టల సంగతి ఎరగను. నీ మాటలు నా కర్థంకావటం లేదు," అన్నాడు అసలు ఖలీఫా.

ఖలీఫాకు చిన్నమూతీ, లావుపాటిబుగ్గలూ ఉండేవి. అది చూసి బెస్తవాడు ఆయన సన్నాయి వాయించేవాడని పొరబడ్డాడు.

"ఒరే భజంత్రీవాడా, నా బట్టలు నాకిచ్చెయ్యకపోయావంటే నిన్ను నా దుడ్డుకర్రతో చావ బాదుతాను, జాగ్రత్త," అన్నాడు బెస్తవాడు.

కె. ఆనందమోహన్‌రావు



వాడి కఱ్ఱను చూసి ఖలీఫా బెదిరాడు. ఆయన తన ముఖ్మల్ అంగరఖాను తీసి బెస్తవాడికిస్తూ, "పోయిన బట్టలకు బదులుగా దీన్ని వేసుకో," అన్నాడు.

"నా దుస్తులు దీనికన్న పదింతలు ఖరీదు గలవి. పైగా ఇది ఇంత పొడుగున్నదేమిటి?" అంటూ బెస్తవాడు తన చేపల కత్తి తీసి, ఆ అంగరఖా తన మోకాళ్ళ దాకా మాత్రమే వచ్చేటట్టు కోసి, తరవాత దాన్ని వేసుకున్నాడు.

"చూడు, భజంత్రీవాడా? నువు సన్నాయి కఱ్ర వాయించి నెలకేమాత్రం సంపాదిస్తావు?" అని వాడు ఖలీఫాను అడిగాడు.

"పది దీనారాలు!" అని ఖలీఫా వెంటనే జవాబు చెప్పాడు.

"ఇంతేనా? నేను రోజుకు పది దీనారాలు సంపాదిస్తానే! నాదగ్గిర చేపలు పట్టటం నేర్చుకుంటావా ఏమిటి? నీకు మంచి సంపాదన చూపిస్తాను. ఒకవేళ నీ యజమాని తగాదా పెట్టాడంటే ఈ లాఠీ కఱ్రతో వాడి తల పగలగొట్టేస్తాను," అన్నాడు బెస్త ఖలీఫా.

"నాకు సమ్మతమే," అన్నాడు అసలు ఖలీఫా.

"అయితే ఆ గాడిదమీదనుంచి దిగి నావెంట రా. ఇప్పుడే పని ప్రారంభించుదాం!" అన్నాడు బెస్తవాడు.

అసలు ఖలీఫా తన గుర్రాన్ని దిగి, దాన్ని ఒక చెట్టుకు కట్టి, బెస్తవాడి వెంట నీళ్ళవద్దకు వెళ్లాడు.

"ఇదుగో, ఈ వలను ఇట్లా పట్టుకో. ఇట్లా నీ చేతిమీదిగా రానీ. ఇప్పుడు దాన్ని నీళ్లలోకి విసురు!" అని బెస్తవాడు ఖలీఫాకు వలవేసే పద్ధతి నేర్పించాడు. ఖలీఫా తనకున్న బలమంతా వినియోగించి వల విసిరి, ఒక్క క్షణం ఆగి, వలను లాగసాగాడు. అది చాలా బరువుగా తోచటంవల్ల ఆయన బెస్తవాణ్ణి సాయం పిలిచాడు.



"పాపిష్టి భజంత్రీవాడా, పోనీ పాపం గదా అని నా బట్టలకు బదులు నీ ముష్టి అంగరఖా తీసుకున్నానేగాని, ఇవాళ నా వల చినగగొట్టావో, నీ గాడిదను తీసేసుకుని, నీ వీపు వాయగొడతాను!" అన్నాడు బెస్తవాడు ఆగ్రహంతో.

ఎలాగైతేనేం, ఇద్దరూ కలిసి ఉపాయంగా వలను ఒడ్డుకు లాగేసరికి దాని నిండా అన్ని రకాల చేపలూ, అన్ని రంగుల చేపలూ ఉన్నాయి!

"ఫరవాలేదు! నిన్ను నేను మంచి బెస్తవాణ్ణి చేయగలను. నువు వెంటనే బజారుకు వెళ్లి రెండు తట్టలు తీసుకురా. ఈ చేపలన్నిటినీ తట్టల్లో పెట్టి, నీ గాడిద మీద ఎత్తి, చేపల బజారుకు తీసుకుపోదాం. అక్కడ నువు చెయ్యవలసిందల్లా ఏమిటంటే త్రాసు పట్టటమూ, డబ్బు వసూలు చేసుకోవటమూనూ. పద, పద, జాగు చెయ్యకు!" అన్నాడు బెస్తవాడు.

"చిత్తం, చిత్తం!" అంటూ ఖలీఫా తన గుర్రం ఎక్కి బయలుదేరాడు. ఆయనకు నవ్వాగటం లేదు.

ఆయన తిరిగి వచ్చేసరికి వజీర్ జాఫరూ మిగిలిన పరివారమూ ఆయనకోసం ఆత్రంగా ఎదురుచూస్తున్నారు.



"ఏలినవారికి ఏదో ఉద్యానం కనపడినట్టుంది! అక్కడ ఇంతసేపూ విశ్రాంతి తీసుకున్నారులాగుంది!" అన్నాడు జాఫర్.

ఖలీఫా విరగబడి నవ్వుతూ జరిగినదంతా చెప్పాడు. ఆయనకు ఒక వినోదం తట్టింది. ఆయన తన పరివారంకేసి తిరిగి, "నది ఒడ్డున ఉన్న చేపల్లో ఎవరెన్ని చేపలు తెస్తే వారికన్ని దీనారాలిస్తాను!" అన్నాడు.

వెంటనే ఖలీఫా భటులందరూ దూరాన కనబడే దిబ్బకేసి దౌడుతీశారు. వాళ్ళు బెస్త ఖలీఫామీద పడి రెండు చేతులా అమరినన్ని చేపలు పట్టుకుని తిరిగి పోసాగారు.

"ఈ చేపల్లో ఏదో మహత్తు ఉండి ఉండాలి!" అనుకున్నాడు బెస్తవాడు ఆశ్చర్య సంభ్రమాలతో. ఇక ఉపేక్షిస్తే తనకు ఒక్క చేపకూడా తక్కదనుకుని, వాడు చెరొక చేత్తోనూ ఒక్కొక్క చేప పట్టుకుని నదిలోకి దూకాడు.

ఈలోపల ఖలీఫాభటులు మిగిలిన చేపల నన్నిటినీ పట్టుకుని ఖలీఫావద్దకు తిరిగి వెళ్ళారు. ఒక నీగ్రో బానిసమాత్రం అందరి కన్న ఆలస్యంగా నదివద్దకు వచ్చి చేరాడు. వాడు నదిలో ఉన్న బెస్తవాడి చేతుల్లో చేపలుండటం చూసి, "ఒరే బెస్తవాడా, ఒకసారి పైకి రా!" అని పిలిచాడు.

"పోరా, దొంగముండాకొడకా!" అని బెస్తవాడు నీగ్రోను తిట్టాడు.

నీగ్రోవాడు నీటి అంచుకు వచ్చి, "నాకు నీ చేపలిచ్చావంటే నీకు మంచి బహుమానం ఇస్తాను!" అన్నాడు మంచిగా. అప్పటికీ బెస్తవాడు దారికి రాలేదు. నీగ్రో వాడు తన చేతిలో ఉన్న ఈటెను బెస్త వాడికి గురిచేసి విసరబోయాడు. అప్పుడు బెస్తవాడు, "ఊరుకో, ఊరుకో! ఈ వెధవ చేపలకోసం చావటం నా కిష్టంలేదు!" అంటూ, తన చేతుల్లో ఉన్న చేపలను విసిరి ఒడ్డున పారేశాడు. నీగ్రో వాటిని ఎత్తి తన చేతిరుమాలులో చుట్టి పట్టుకుని



బెస్తవాడికి ఈనామిచ్చే ఉద్దేశంతో తన జేబులు తడువుకున్నాడు. కాని వాడివద్ద ఆ క్షణాన చిల్లిగవ్వకూడా లేదు.

"ఇవాళ నీ గీత బాగా లేదురా. రేపు ఖలీఫాగారి రాజభవనానికి వచ్చి నాకోసం అడుగు. నా పేరు సండాల్. నేను నీకు మంచి ఆతిథ్యం ఇచ్చి నీకు మంచి ఈనాం కూడా ఇస్తాను," అంటూ నీగ్రోవాడు తన గుర్రమెక్కి వెళ్లిపోయాడు.

"ఇవాళ ఎంత దుర్దినం!" అనుకున్నాడు బెస్తవాడు. తరవాత వాడు నది ఒడ్డున వున్న వల నెత్తిన వేసుకుని విచారపడుతూ ఇంటికి వెళ్ళిపోయాడు.

టిగ్రిస్ నదీతీరాన ఈ నాటకం జరుగుతున్న సమయంలోనే ఖలీఫా అంతః పురంలో ఇంకొక నాటకం జరిగింది. అది చాలా ఘోరమైన నాటకం.

ఖలీఫా తన పరివారంతో వేటకు బయలుదేరగానే రాణీ జుబేదా ఒక విందు ఏర్పాటు చేసి, దానికి కుతల్ కులుబ్‌నుకూడా ఆహ్వానించింది. ఆమెపైన ఎంతో అభిమానం ఉన్నట్టు నటిస్తూ కొంచెంసేపు పాటలు పాడించి చివరకు ఏదో మిఠాయి తెప్పించి కుతల్ కులుబ్ ముందు పెట్టించి, తిన మన్నది. ఆ అమాయకురాలు ఆ మిఠాయిని నోట్లో పెట్టుకుంటూనే స్పృహతప్పి





పడిపోయింది. ఎందుకంటే జుబేదారాణి ఆ మిఠాయిలో ఏదో మందు కలిపించింది.

వెంటనే జుబేదారాణి పరిచారికలు కుతల్ కులుబ్‌ను ఒక పెట్టెలో పెట్టి బీగం వేసేశారు. తరవాత రాణీ ఒక వార్త అందరికీ తెలియజేసింది: కుతల్ కులుబ్ విందులో భోజనంచేస్తూ ఉపిరి గొట్టం మూసుకుపోయి చనిపోయిందనీ, ఆమెను అప్పటికప్పుడే పాతేయించి గోరీకూడా కట్టించాననీ ఆమె అందరికీ చెప్పింది.

ఈ సంగతి అందరూ సమ్మేందుకై జుబేదారాణి తన తోటలో ఒక చోట చలవ రాతి గోరీ కట్టించింది. అయితే కుతల్ కులుబ్ మాత్రం జుబేదారాణి పడక గదిలో ఉన్న పెట్టెలోనే ఉన్నది.

ఖలీఫా తిరిగి వచ్చేసరికి గోరీ కట్టటం కూడా పూర్తిఅయింది. తనకు ప్రియమైన బానిసపిల్ల చనిపోయిందని తెలియగానే ఆయన పొందిన బాధకు అంతులేదు. తోటలో జుబేదారాణి కట్టించిన గోరీవద్ద ఒక గంటసేపు కూచుని కంటికీ మంటికీ ఏక ధారగా ఏడిచాడు.

జుబేదా వేసిన పాచిక పారింది. మర్నాడు ఆమె తన బానిసలలో ఒకణ్ణి పిలిచి, "ఒరే, నువు ఈ పెట్టెను బజారుకు తీసుకుపోయి అక్కడ వేలంవెయ్యి. అందులో ఏమున్నదో ఎవర్నీ చూడనివ్వకు. పెట్టెను అమ్మేసి నాక ఆ వచ్చిన డబ్బును బీదసాదలకు ధర్మంచేసి తిరిగిరా," అని చెప్పి పంపింది.

బెస్తవాడు ఉదయం నిద్రలేస్తూనే సందాల్‌ను కలుసుకుని ఈనాం పుచ్చుకునే ఉద్దేశంతో రాజభవనానికి బయలుదేరాడు. ముఖద్వారంవద్దనే వాడికి నీగ్రోవాడు కనిపించాడు. కాని నీగ్రోవాడు బెస్తవాడి ఈనాంకోసం తన జేబులో చెయ్యి పెట్టేటంతలో వజీర్ జాఫర్ అటుగా వచ్చాడు. నీగ్రోవాడు జాఫర్‌తో చాలాసేపు మాట్లాడుతూ నిలబడటం చూసి బెస్తవాడు

తొందరపడ సాగాడు. జాఫర్ బెస్తవాడి తొందర గమనించి, "ఈ మనిషి ఎవరు?" అని నీగ్రోను అడిగాడు.

"నిన్న వీడి చేపలనే మేమంతా ఎత్తుకు వచ్చింది!" అంటూ నీగ్రో జాఫర్‌తో బెస్త వాడి వృత్తాంతం సవిస్తరంగా చెప్పాడు.

"అలాగా? వీడు సమయానికే వచ్చాడు. ఏలినవారు పూర్తిగా విచారంలో మునిగి ఉన్నారు. వీణ్ణి తీసుకుపోతే ఆయనకు వినోదమన్నా కలుగుతుంది! నే నాయనతో మాట్లాడి వస్తాను. అంతదాకా వీణ్ణి వెళ్ళి పోనివ్వకు!" అంటూ జాఫర్ ఖలీఫావద్దకు వెళ్లి బెస్తవాడు వచ్చిన సంగతి చెప్పాడు.

ఈ మాట వినగానే ఖలీఫాకు ఉత్సాహం వచ్చినట్టయింది. "అవును. వాడూ నేనూ భాగస్వాములం. అల్లా వాడికి నానుంచి ఎటువంటి బహుమానం ఇప్పిస్తాడో చూద్దాం!" అంటూ ఖలీఫా, కొన్ని కాగితం ముక్కలు చించి, వాటిమీద సున్నా మొదలుకొని వెయ్యిదాకా అంకెలూ, చిన్న ఉద్యోగం మొదలుకొని ఖలీఫాదాకా గల అన్ని పదవులూ, కొరడా దెబ్బలు లగాయతు ఉరిశిక్ష వరకూ గల రకరకాల శిక్షలూ వేరువేరుగా రాయమని జాఫర్‌కు ఉత్తరువిచ్చాడు.



ఈ పని పూర్తి అయాక జాఫర్ వెళ్లి బెస్తవాణ్ణి సప్తప్రాకారాలు దాటించి ఖలీఫా ఉండే చోటికి తీసుకువచ్చాడు. అక్కడి వాతావరణం చూసి బెస్తవాడికి పూర్తిగా మతిపోయింది. ఖలీఫా ఉండే గది ప్రవేశించేటప్పుడు జాఫర్ వాడితో, "ఓరీ, ఇప్పుడు నిన్ను ఏలినవారి సమక్షంలోకి తీసుకుపోతున్నాను, జాగ్రత్త!" అని చెప్పాడు. కాని మతిపోయివున్న బెస్తవాడికి ఆ మాటలు అర్థమే కాలేదు. అయితే వాడు ఖలీఫా వుండే గదిలోకి అడుగుపెట్టి ఎదురుగా ఖలీఫాను చూడగానే వాడి కంగారంతా మాయమయింది.

"నువ్విక్కడ ఉన్నావా, భజంత్రీవాడా? నిన్న బుట్టలు తెమ్మని పంపితే అదే పోత పోయావుగదా, ఏమన్నమనిషివి? నీమూలంగా నిన్న దొంగలు నామీద పడి మనం పట్టిన చేపలన్నీ కాజేశారు. అంతటితో పోయిందిగదా అనుకుంటే నన్నీ దుర్మార్గులు పట్టుకున్నారు. సరేగాని, ఈ ఖైదులోకి నిన్ను తెచ్చినవారెవరూ?" అని బెస్తవాడు ఖలీఫాతో ఉద్రేకంగా మాట్లాడసాగాడు.

అసలు ఖలీఫా తాను తయారు చేయించిన చీట్లను బెస్తవాడి ముందుకు తోసి, "అదంతా తరవాత చెపుతాను. దగ్గిరికి వచ్చి ఈ చీట్లలో ఒకటి తీసుకో!" అన్నాడు.

"నిన్న చేపలు పట్టటం నేర్చుకోవటం ప్రారంభించావో లేదో, అప్పుడే ఇవాళ జోస్యంలో పడ్డావా? నీకు దేనిలోనూ నిలకడ లేదేం?" అని బెస్తవాడు ఖలీఫాను కోప్పడ్డాడు.

"నోరు మూసుకుని, ఏలినవారు చెప్పినట్టు ఒక చీటీ తియ్యి!" అంటూ జాఫర్ బెస్తవాణ్ణి గదమాయించాడు.

బెస్తవాడు కిక్కురుమనకుండా ఖలీఫా ముందుకువచ్చి చీటీ ఒకటి తీశాడు. దానిలో నూరు కొరడా దెబ్బలు రాసిఉంది!

రాజభటులు వాణ్ణి పడదోసి నూరు కొరడా దెబ్బలు కొట్టారు.



"బహుమానంకోసం వచ్చిన పిచ్చి వెధవ దెబ్బలుతిని వెళ్లటం భావ్యంకాదు. వాడి అదృష్టాన్ని మరొకసారి చూసుకో నివ్వండి!" అన్నాడు జాఫర్.

ఖలీఫా అదేవిధంగా బెస్తవాణ్ణి మరొక చీటీ తీయమన్నాడు. ఆ చీటీలో సున్నా అంకె వేసిఉన్నది.

"వీడి అదృష్టంకూడా వీడిలాగే ఉంది. ముచ్చటగా మూడో చీటీకూడా తీయ నిద్దాం!" అన్నాడు జాఫర్.

బెస్తవాడు తీసిన మూడో చీటీలో ఒక దీనారం అని రాసి ఉన్నది. వాడికి ఒక దీనారం ఇచ్చారు.

"ఏమిటీ? నూరు దెబ్బలకు ఒక్క దీనారమా? ఇందుకు మీరంతా తప్పక అనుభవిస్తారులే!" అన్నాడు బెస్తవాడు.

ఈమాటలకు ఖలీఫా విరగబడి నవ్వాడు. జాఫర్ వాణ్ణి చెయ్యి పట్టుకుని బయటికి తీసుకుపోయాడు. బయట నీగ్రో కనిపించి, "ఖలీఫాగారు నీకిచ్చిన ఈనాంలో నాకు సగం ఇవ్వవా?" అని బెస్తవాణ్ణి అడిగాడు.

"ఎందుకివ్వనూ? యాభై కొరడా దెబ్బలూ, దీనారమూ పుచ్చుకో!" అన్నాడు బెస్తవాడు, తనకు ఖలీఫా ఇచ్చిన దీనారాన్ని నీగ్రోవాడిమీద గిరవాటు వేసి తొందరగా వెళ్లిపోతూ.





నీగ్రోకు బెస్తవాడిపైన జాలి కలిగింది. వాడు భటులను పంపి బెస్తవాణ్ణి పిలిపించి, "ఇదుగో నీ దీనారం. నేనిస్తానన్న ఈనాం కూడా ఇదుగో, నూరు దీనారాలు! ఇవి తీసుకుని వెళ్లి సుఖంగా బతుకు!" అన్నాడు.

ఆ బంగారాన్ని చూసుకుని బెస్తవాడు తన కష్టాలన్నిటినీ మరిచిపోయాడు. వాడు ఏవేవో తీయటి కలలు కంటూ కొంతసేపటికి పెద్దబజారు చేరాడు. అక్కడ వాడికి జనం ఒక గుంపుగా కనిపించారు. జనాన్ని తోసుకుంటూ వెళ్లి వాడు గుంపు మధ్యను ఒక పెట్టెనూ, దానిపైన కూచునిఉన్న ఒక బానిసనూ చూశాడు.



పెట్టెపక్కగా ఒక ముసలివాడు నిలబడి, "పెద్దమనుషులారా! వర్తకశ్రేష్ఠులారా! ఈ పెట్టెలో ఏమి పెన్నిధి ఉన్నదీ ఎవరికీ తెలియదు. కాని ఇది జుబేదారాణి గారి మందిరంనుంచి వచ్చింది. దీనికి మొదటి పాట ఎంత పాడతారో పాడేవారు ముందుకు రండి!" అని అరుస్తున్నాడు.

ఒక వర్తకుడు ముందుకు వచ్చి, "ఇదేమీ లాభసాటి బేరం కాదు. అయినా నాపాట ఇరవై దీనారాలు!" అన్నాడు.

"యాభై!" అని వెంటనే ఇంకొకరు అన్నారు.

"నూరు!" అని మరొకరు అరిచారు.

"ఇంకా ఎక్కువ పాడగలవారెవరైనా ఉంటే ముందుకు రండి. లేకపోతే నూరు దీనారాలకు కొట్టేస్తాను!" అన్నాడు వేలం నడిపేవాడు.

బెస్తవాడు ఉద్రేకంతో గొంతెత్తి, "నూటఒకటీ!" అన్నాడు. మిగిలిన వర్తకులంతా వాణ్ణిచూసి నవ్వారు. అంతకన్న ఇంకెవరూ ఎక్కువ పాడనందున, నూటఒక్క దీనారానికి ఆపెట్టె బెస్తవాడికి పోయింది. వాడు తన దగ్గరఉన్న డబ్బంతా జుబేదారాణి బానిసకు ఇచ్చేసి, పెట్టె భుజాన ఎత్తుకుని, పడుతూ లేస్తూ ఇంటికి చేరుకున్నాడు.



అ పెట్టెలో ఏమున్నదో చూడాలని బెస్త వాడికి కోరిక కలిగింది. కాని వాడు ఎంత ప్రయత్నించినా బీగం రాలేదు. "ఛీ! ఛీ! ఇంత డబ్బుపోసి తెరవటానికికూడా రాని పెట్టెను కొనుక్కున్నానే!" అనుకున్నాడు. చిట్టచివరకు వాడు అలిసిపోయి, సొమ్మసిల్లి అ పెట్టెమీదనే పడుకుని గాఢనిద్రలో మునిగిపోయాడు.

వాడు గట్టిగా ఒక గంటసేపు నిద్ర పోయాడో లేదో, పెట్టెలో ఏదో కదలిక కలిగి వాడి నిద్ర కాస్తా చెడిపోయింది. వాడు కంగారుతో పెట్టెమీదినుంచి దూరంగా దూకి, "ఇందులో ఏవో భూతాలు చేరాయి! ఇంకా నయం మూత వచ్చిందికాదు! లేకపోతే అ భూతాలు బయటికి దూకి, అమాంతం నామీద పడి విరుచుకు తిని ఉండేవి!" అనుకున్నాడు.

క్షణక్షణానికీ పెట్టెలో కదలిక జాస్తి అవుతున్నది. దీపం వెలిగింతామనుకుంటే ఎంత వెతికినా అ దీపం ఎక్కడ ఉన్నదీ తెలియలేదు. బెస్తవాడు తలుపు తెరిచి వీధిలోకి వెళ్లి, "అయ్యా! రక్షించండి! రక్షించండి!" అని కేకలు పెట్టసాగాడు.

చుట్టుపక్కల ఇళ్లవాళ్లకు ఈ కేకలతో నిద్రాభంగమయింది. వాళ్లు ద్వారాలనుంచీ,



కిటికీలనుంచీ తొంగిచూసి, "ఏమిటి? ఏం జరిగింది?" అని ప్రశ్నలు వేశారు.

"దయ్యాలు! భూతాలు! మీకు పుణ్యం ఉంటుంది! కాస్త దీపమూ, సుత్తి దయ చేయించండి! నా యింటో దయ్యాలు చేరాయి!" అన్నాడు బెస్తవాడు.

ఈ మాటలకు అందరూ నవ్వారు. ఒకరు దీపమూ, ఇంకొకరు సుత్తీ ఇచ్చారు. బెస్త వాడు వాటిని తీసుకుని తిరిగి తన ఇంట్లోకి వెళ్లిపోయాడు. సుత్తి దెబ్బకు పెట్టెబీగం ఊడివచ్చింది. దీపంసహాయంతో వాడు అ పెట్టెలోపల ఒక అద్భుత సౌందర్యవతి ఉన్నట్టు తెలుసుకున్నాడు. అమె

అప్పుడప్పుడే స్పృహ వచ్చినదానిలాగా తన కళ్ళు కొద్దిగా తెరిచింది.

"అరె, అల్లా! ఎవరు నువు?" అని బెస్తవాడు పెట్టెపక్క మోకరించి రహస్యంగా అడిగాడు.

ఆమె కళ్లు సాంతం తెరిచి, బెస్తవాడికేసి చూస్తూ, "నువ్వెవరు? నే నెక్కడ ఉన్నాను?" అని అడిగింది.

"అమ్మా, నేను బెస్తవాణ్ణి. నా పేరు ఖలీఫా. నువు నాఇంట్లోనే ఉన్నావు!" అన్నాడు వాడు.

"ఇది ఖలీఫా హారున్ అల్‌రషీద్ రాజభవనంకాదా?" అన్నదామె.

"ఇంకానయం! నీమీద నాకుతప్ప ఇంకెవరికీ ఏ హక్కూలేదు. నిన్ను వేలంపాడి నూటఒక్క దీనారానికి ఈరోజే కొనుక్కున్నాను. అల్లా దయవల్ల నా అదృష్టం తిరిగింది!" అన్నాడు బెస్తవాడు. కుతల్‌కులుబ్‌కు వాడి వాగుడు ఏమాత్రం తల కెక్కలేదు. ఆమెను విపరీతమైన అకలి బాధించసాగింది.

"తినటానికేమైనా ఉందా?" అన్నదామె.

"అల్లాతోడు! ఇంటో తినటానికి ఏమీ లేదు. నేనే రెండు మూడు నాళ్లుగా పస్తుంటున్నాను!" అన్నాడు బెస్తవాడు.

"పోనీ డబ్బున్నదా?" అన్నదామె.



"ఈ పెట్టెను అల్లా చల్లగా చూడాలి! నాకున్నదంతా దీనికింద ఖర్చు చేశాను!" అన్నాడు వాడు.

"నాకు చచ్చే ఆకలిగా ఉంది. ఎవరింటికన్నా వెళ్లి తినటానికేదన్నా తీసుకురా!" అన్నదామె.

బెస్తవాడు వీధిలోకి వెళ్లి, "ధర్మదాతల్లారా! కడుపుకాలి బాధపడుతున్నవాడికింత కూడుపెట్టండి!" అని పెద్దగా కేకలు పెట్టసాగాడు.

ఈ కేకలకు మళ్లీ అందరూ నిద్రలు లేచారు. వాణ్ణి తిట్టుకుంటూ తమ ఇళ్ళలో ఉన్న ఆహారం వాడి మొహాన వేశారు. వాడు దాన్ని యింటికి పట్టుకుపోయి కుతల్ కులుబ్‌కు పెట్టాడు.

"నాకు ముందు ఇన్ని మంచినీళ్లియ్యి, నోరు ఎండిపోతున్నది!" అన్నదామె.

బెస్తవాడు ఖాళీకూజా తీసుకుని వీధిలోకి పరిగెత్తి మళ్ళీ ఇరుగుపొరుగు వాళ్ళను లేపాడు. వాళ్ళు మళ్లీ వాణ్ణి గట్టిగా శాపనార్థాలు పెట్టి వాడి కూజా నీళ్లతో నింపి పంపేశారు.

ఆమె కడుపునిండా తిండి తిని నీళ్ళు తాగినాక తన కథ యావత్తూ బెస్తవాడికి చెప్పింది. చివరకామె, "ఇంతకూ నీ అదృష్టం బాగుంది! నాప్రాణం కాపాడావని





తెలిస్తే, ఖలీఫా తప్పకుండా నిన్ను అందల మెక్కిస్తాడు!" అన్నది.

"వాడి సంగతి నాకు చెప్పకు. ఖలీఫా అంటే ఎవరో అనుకునేవాణ్ణి, వాడు నా దగ్గిర చేపలుపట్టటం నేర్చుకున్న భజంత్రీ వాడే! ప్రాణంపోయినా వాడు డబ్బుమాత్రం ఇవ్వడు, మహా పిసినిగొట్టు!" అన్నాడు బెస్తవాడు.

ఈ మాటలు విని ఆమె, "నువు ఇటు వంటి వెకిలితనం మానితే తప్ప బాగు పడవు! నీ జాతకం మారాలంటే ముందు నువు మారాలి! నీకు మంచి రోజులు రాబోతున్నాయి, బాగా ఆలోచించుకో!" అని మందలించింది.

ఆమె మందలింపుతో బెస్తవాడి మన సులో గొప్ప మార్పేదో వచ్చింది. వాడికళ్లకు అంతవరదాకా అడ్డంఉన్న పొరలు తీసేసి నట్టయింది. వాడు మొదటిసారిగా ప్రపం చాన్ని ఉన్నదున్నట్టుగా చూడసాగాడు.

తెల్లవారుతూనే కుతల్‌కులుబ్ ఇబస్ అల్ కిర్మాన్‌కు ఒక లేఖ రాసి బెస్తవాడి ద్వారా పంపింది. నగలవర్తకుడు ఆ ఉత్తరం చూసుకుని, "మీ ఇల్లెక్కడ?" అని అడిగాడు. బెస్తవాడు ఆయనను తన యింటికి తీసుకుపోయాడు.

నగలవర్తకుడు బెస్తవాడికి వెయ్యి దీనారాలు బహుమానం ఇచ్చి కుతల్ కులుబ్ బతికేఉన్నట్టు చెప్పటానికి ఖలీఫా వద్దకు వెళ్ళాడు.

ఈవార్త విని ఖలీఫా అమిత ఆనందం పొందాడు. ఆయన ఈసారి బెస్త ఖలీఫాను పిలిపించి యాభైవేల దీనారాల రొక్కమూ గుర్రమూ, దాసదాసీలూ బహూకరించాడు.

ఇప్పుడు బెస్త ఖలీఫా గొప్ప ఇంటి వాడయాడు. అతను మంచి భవంతి ఒకటి కొని, ఒక గొప్పఇంటి ఆడబడుచును పెళ్ళాడి, ఖలీఫాగారి అంతరంగికులలో ఒకడుగా ఉంటూ సుఖంగా జీవించాడు.






తోడేలును హతమార్చి, నక్కను ఎన్నోసార్లు ఏడిపించానన్న గర్వంతో కుందేలు అందరివద్దా గప్పాలు కొట్టసాగింది.

ఒకనాడు కుందేలు తాబేలుతో తన ప్రతాపం చెబుతూ, "నేను వాయువేగంగా పరిగెత్తగలను గనక ఎన్నోసార్లు ప్రాణం రక్షించుకోగలిగాను. అదే నీవంటి కదలలేని ప్రాణి అయితే ఏమైఉండేదో!" అన్నది.

తాబేలు గంభీరంగా, "ఆ మాటకు వస్తే నాతో నువ్వెక్కడ కదలగలవు. నీది వాయువేగమైతే నాది మనోవేగం!" అన్నది.

"పందెం" అంటే "పందెం!" అని ఇద్దరూ రాబందును తీర్పరిగా పెట్టుకుని పోటీపరుగు ఏర్పాటు చేసుకున్నారు. పరిగెత్తవలసిన దూరం ఐదుమైళ్ళు.

"నువు నేరుగా రోడ్డువెంబడే పరిగెత్తు. నేను అడవి దారిన చుట్టుతిరిగి పరిగెత్తి కూడా నిన్ను ఓడిస్తాను!" అన్నది తాబేలు.

పందెం జరగటానికి ఒకరోజు ఏర్పాటయింది. ఎటుపోయి ఎటువచ్చినా మంచిదని కుందేలు రోజూ రోడ్డువెంట పరిగెత్తి అభ్యాసం సాగించింది.

తాబేలుమాత్రం తానుండే మడుగు విడిచి రాలేదు. తాబేలుకు భార్యా, ఈడు వచ్చిన ముగ్గురు కొడుకులూ ఉన్నారు. అందరూ అచ్చగా తాబేలులాగే ఉంటారు.

పందెం రోజు ఉదయం పొద్దు పొడవక ముందే తాబేలూ, భార్యా, కొడుకులూ నిద్ర లేచారు. తాబేలు భార్య వెళ్ళి మొదటిమైలు రాయిదగ్గిర చేరింది. ముగ్గురు పిల్లలు మధ్యదారిలో అక్కడక్కడా నిలబడ్డారు. తాబేలుమాత్రం అయిదో మైలురాయి సమీపంలో చేరింది.

ఇంతలో పందెం ప్రారంభించేవేళ అయింది. రాబందును వెంటబెట్టుకుని కుందేలు చేరి, తాబేలు భార్యతో, "నువు

టి. శంభుదాసు

నాకన్న ముందే వచ్చి సిద్ధంగా ఉన్నావే, తాబేలు బావా ?" అన్నది.

పందెం చూడటానికి ఇంకా అనేక మృగాలు వచ్చాయి.

"ఇక బయలుదేరటానికి సిద్ధంగా ఉండండి ! ఒకటి...రెండు...మూడు !" అని రాబందు గట్టిగా అన్నది.

"మూడు !" అని రాబందు అనటమే వ్యవధిగా కుందేలు కదలి బాణంలాగా వెళ్ళిపోయింది.

"నాకేం తొందర ? నేను చుట్టూ తిరిగి పోతాను !" అంటూ తాబేలుభార్య అడివిలో ప్రవేశించి, నేరుగా ఇంటికి వెళ్ళిపోయింది.

కుందేలు మొదటిమైలు పూర్తి చేయ బోతూండగా తాబేలు పక్కనున్న పొదలలో నుంచి రోడ్డుమీదికి వస్తూ కనిపించింది. అది తాబేలు కొడుకు !

కుందేలు నిర్ఘాంతపోయి, "అప్పుడే నాకన్న ముందు వచ్చావా ?" అన్నది.

"తాపీగా వస్తున్నాను !" అంటూ తాబేలు కొడుకు రోడ్డుదాటి నేరుగా తమ మడుగుకు వెళ్ళిపోయింది.

కుందేలు ఈసారి ఇంకా వేగం హెచ్చించింది. కాని రెండోమైలు చివర మళ్ళీ తన కన్న తాబేలు ముందుండటం గమనించింది.

మూడోమైలు చివరా, నాలుగోమైలు చివరా ఇదేజరిగింది. అయిదోమైలు చివర పొదలలో దాగివున్న తాబేలు, రాబందు ఎగిరి వస్తుండటం చూచి, బయిటికివచ్చి సునాయాసంగా గమ్యస్థానం చేరుకున్నది.

మరి కాస్సేపటికి కుందేలు చెమటలు దిగగారుతూ, రొప్పుతూ వచ్చింది. ప్రేక్షకులు ఈలలువేసి కుందేలును హేళనచేశారు.

"పోటీలో తాబేలు గెలిచింది, కుందేలు ఓడింది. అందుచేత పందెం మొత్తం తాబేలుకు ఇచ్చేస్తున్నాను !" అన్నది రాబందు.

కుందేలు తీరని పరాభవంతో తలవంచుకుని యింటిదారి పట్టింది.






చీనాదేశంలోని ఒక మహానగరంలో పూర్వం ముస్తఫా అనే దర్జీ ఒకడుండేవాడు. అయన చాలా బీదవాడు. రోజల్లా శ్రమపడినా తన సంపాదనతో తన భార్యనూ కుమారుణ్ణీ పోషించలేకపోయే వాడు.

ముస్తఫా కొడుకుపేరు-అలాదీన్. వాడు అపరిమితమైన సోమరి. దానికితోడు వాడికి కాస్తయినా లక్ష్యంలేదు. తలిదండ్రుల మాట కొంచెమైనా వినేవాడుకాడు. వాడు తెల్లవారుతూనే బయటికి వెళ్ళేవాడు, రోజల్లా తనలాటి సోమరి పిల్లలను వెంటవేసుకుని వీధుల్లోనూ, మైదానాల్లోనూ ఆటలాడేవాడు.

అలాదీన్‌కు పని నేర్చుకునే వయసు రాగానే వాడి తండ్రి వాణ్ణి తన దుకాణానికి తీసుకుపోయి, సూదితో కుట్టటం నేర్పాడు. కాని వాడు కుదురుగా కూచుని పనిచేసే లాగు చెయ్యటం తండ్రివల్ల కాలేదు. తండ్రి కాస్త కనుచాటు అయితే చాలు, బయటికి జారుకుని ఇక ఆ రోజల్లా కనపడేవాడు కాడు. ముస్తఫా కొట్టిచూశాడు. కాని అలాదీన్ చాలా మొండిఘటం. చివరకు, చేసేది లేక, ముస్తఫా తన కొడుకును వదిలేసి ఊరుకున్నాడు. సగం వాణ్ణిగురించిన మనోవ్యాధితోనే ముస్తఫా మంచంపట్టి, కొద్ది నెలలు తీసుకుని చనిపోయాడు.

తండ్రి పోయాక అలాదీన్‌కు బొత్తిగా అదుపూ, అజ్ఞా లేకుండాపోయింది. ఇప్పుడు వాడు రోజల్లా వీధుల్లోనే గడుపుతూ, తన

బి. ప్రసాదరావు




యీడు పిల్లలను వెంటవేసుకు తిరగ సాగాడు. పదిహేనేళ్లు నిండినదాకా వాడి జీవితం ఇలాగే గడిచింది.

తన భర్త పోగానే ఆయన దుకాణం తన కొడుకుకు పనికిరాదు గనక దాన్ని అమ్మేసి, అలాదీన్ తల్లి నూలు వడికి అంతో ఇంతో సంపాదిస్తూ దానితో తనకొడుకును పోషిస్తూ వచ్చింది. తల్లి తన కోసం కష్టపడుతున్న దన్న జ్ఞానమైనా లేకుండా అలాదీన్ అస్తమానం ఆటలలో గడుపుతూండేవాడు.

ఒకనాడు అలాదీన్ తనయీడు పిల్లలతో కలిసి వీధిలో ఆడుతూండగా ఆ దారిన వెళ్లే ఒక మనిషి ఆగి అతణ్ణి పరీక్షగా చూశాడు.



ఈ మనిషి ఆఫ్రికాఖండంలోని మొరాకో దేశంనుంచి వచ్చిన ఒక మూర్‌జాతివాడు. ఆయన ఒక గొప్ప మాంత్రికుడుకూడా. కాస్సేపు అలాదీన్‌ను పరీక్షించి, ఆ కుర్రవాడు తన పనికి ఉపయోగపడతాడని నిశ్చయించుకుని, ఆ మాంత్రికుడు అలాదీన్ స్నేహితులద్వారా అలాదీన్ పేరూ, ఇతర వివరాలూ తెలుసుకున్నాడు.

తరవాత ఆయన అలాదీన్‌ను సమీపించి, "నాయనా, నువు ముస్తఫా అనే దర్జీకి కొడుకువుకాదూ?" అని అడిగాడు.

"అవునండీ. ఆయన పోయి చాలాకాలమయింది," అన్నాడు అలాదీన్.

ఈమాట వినగానే మాంత్రికుడు అలాదీన్‌ను కౌగలించుకుని, చెంపలమీద ముద్దు పెట్టుకుని, భోరున కన్నీరు కార్చసాగాడు.

"ఎందుకండీ ఏడుస్తున్నారూ? మీకు మా నాన్న తెలుసా?" అని అలాదీన్ మాంత్రికుణ్ణి అడిగాడు.

"ఎంతమాట అడిగావురా, నాయనా? నా సొంత అన్న చచ్చిపోయాడని వినేసరికి ఏడుపురాదా మరి? ఎన్నో ఏళ్లుగా దూరదేశాలలో సంచారంచేసి మా అన్నను ఒక్కసారి కళ్ల జూతామని నేనువస్తే, నువేమో ఆయన పోయినాడంటివి! అయితే నిన్ను








చూడగానే మా అన్న కొడుకువని పోల్చుకున్నాను సుమా. మీ నాన్న కింకా పెళ్లి కాకమునుపే, అంటే నలభైఏళ్ల క్రితం, నేను దేశంవదలి వెళ్లాను. అయినా నిన్ను చూడగానే అచ్చు మా అన్నను చూచినట్టే అయింది. నాకిక నువుతప్ప ప్రపంచంలో ఇంకెవరూ లేరు. నిన్ను చూచుకుని మా అన్నను చూసినట్టే సంతోషిస్తాను!" అంటూ మాంత్రికుడు పది బంగారు నాణాలు తీసి అలాదీన్ చేతిలో పెట్టి, "ఈ డబ్బు మీ అమ్మకియ్యి. నేను దేశంలోకి వచ్చాననీ, అవిడను అడిగాననీ చెప్పు, ఏం? నేను రేపు మీ యింటికి వచ్చి అవిడను పరామర్శిస్తాను; మా అన్న ఉండిన ఇల్లు చూచి సంతోషిస్తాను," అన్నాడు.

మాంత్రికుడిచ్చిన సొమ్ము చూడగానే అలాదీన్‌కు పరమానందమయింది. భోజనం వేళకుగాని ఇల్లు చేరనివాడు, ఆ రోజు ముందుగానే ఇంటికి పరిగెత్తి, "అమ్మా, దూరదేశంనుంచి చిన్నాయనవచ్చాడే! రేపు నిన్నుచూడ వస్తాట్ట!" అన్నాడు.

"నీకేమైనా మతి చెడిందిట్రా, నాయనా? నీకు చిన్నాయన ఎవరున్నారూ? మీ నాన్నకు అన్నదమ్ము లెవరూ లేరుగా?" అన్నది తల్లి.

"బాగా చెప్పావులేవమ్మా. ఆయన నా చిన్నాయనే. నన్ను దగ్గిరికి తీసుకుని ముద్దు చేశాడు. నాన్న చచ్చిపోయాడంటే ఏడిచాడు. తాను వచ్చిన సంగతి నీతో చెప్పమన్నాడుకూడా!" అన్నాడు అలాదీన్.

మర్నాడు ఉదయమే మాంత్రికుడు అలాదీన్‌కోసం వెతుకుతూ నగరపు వీధుల వెంట బయలుదేరాడు. కొంతసేపు ఆ వీధీ ఈ వీధీ తిరిగినమీదట ఆయనకు ఒకచోట అలాదీన్, అతని స్నేహితులూ కనిపించారు. మాంత్రికుడు అలాదీన్‌ను మళ్లీ దగ్గిరికి తీసుకుని ముద్దుపెట్టుకుని, రెండు బంగారు నాణాలు వాడి చేతిలో పెట్టి, "ఇవి తీసుకు

పోయి మీ అమ్మకియ్యి. అవసరమైన వస్తువులన్నీ కొని వంటచేసి సిద్ధంగా ఉంచమను. ఈ రాత్రికి నేను భోజనానికి వస్తున్నానని చెప్పు. అన్నట్టు, మీ ఇంటికి దారి చూపించు," అన్నాడు.

అలాదీన్ అలాగేనని మాంత్రికుడికి తన ఇంటిదారీ, గుర్తులూ చెప్పి, రెండు బంగారు నాణాలూ తీసుకుని తల్లివద్దకు పరిగెత్తివెళ్ళి, "అమ్మా, చిన్నాయన సాయంకాలం మనింటికి భోజనానికి వస్తున్నాడు!" అని చెప్పాడు.

తల్లి అప్పటికప్పుడే బయలుదేరి బజారుకు వెళ్లి వంటసామగ్రి ఏమేమి కావాలో అదంతా కొనుక్కు వచ్చింది. ఆ పేద కొంపలో వంటపాత్రలకుకూడా కరువే; అందుచేత ఆవిడ ఇరుగుపొరుగు ఇళ్లనుంచి పాత్రసామాను అరువు తెచ్చుకుని, వంట ప్రారంభించింది.

చీకటి పడింది. అలాదీన్‌తో తల్లి, "వంట పూర్తి అయింది, నాయనా! ఒకవేళ మీ చిన్నాయనకు మనింటిదారి తెలుసో, తెలీదో, నువాయనకోసం బయలుదేరి పోతావా ఏమిటి?" అన్నది.

అల్లాదీన్ బయటికి పోవటానికి సిద్ధమవు తుండగా వాకిలి తలుపు తట్టిన చప్పుడయింది. అలాదీన్ వెళ్ళి తలుపు తీశాడు; మాంత్రికుడు బోలెడన్ని పళ్లూ ఫలాలూ,



పానీయాలూ కూలివాడిచేత పట్టించుకుని లోపలికి వచ్చాడు.

మాంత్రికుడు కూలివాణ్ణి పంపేసి అలాదీన్ తల్లిని పలకరించాడు. తరవాత ఆయన గుడ్లనీళ్ళు నింపుకుంటూ, "మా అన్నగారు ఎక్కడ కూచునేవారో దయచేసి చూపిస్తారా, వదినెగారూ ?" అని అడిగాడు.

అలాదీన్ తల్లి మాంత్రికుడికి ముస్తఫా కూచుంటూ ఉండిన స్థలం చూపించింది. వెంటనే మాంత్రికుడు ఆ స్థలందగ్గిర మోకరిల్లి, దణ్ణంపెట్టి, కళ్లను అద్దుకుని, కంటి వెంట నీరుకారుస్తూ, "అయ్యో, అన్నా! నేను ఎంత పాపంచేశానో, నువు బతికుండగా రాలేకపోయాను, ఎంత అభాగ్యుణ్ణి!" అని ఒక శోకంపెట్టాడు.

"నువు అచోటులోనే కూర్చోనాయనా!" అన్నది అలాదీన్ తల్లి.

"లేదు. నేను అక్కడకూచోను! మీరేమీ అనుకోకుండా ఉంటే దానికెదురుగా కూచుంటాను. ఆయనకెదురుగా కూచునే భాగ్యం లేకపోతే మానె, ఆయన కూచునే చోటికెదురుగా కూచునే భాగ్యమైనా నాకు దక్కనివ్వండి!" అన్నాడు మాంత్రికుడు.

ఈ వగల ఏడుపులు చూసి అలాదీన్ తల్లి ఆ మనిషి నిజంగా తన భర్తకు తమ్ముడేనని నమ్మసాగింది. చివర కావిడ,







"ఎందుకేడుస్తావు, నాయనా? ఊరుకో! చచ్చినవారితో చావలేంగదా!" అంటూ మాంత్రికుణ్ణి ఊరడించింది.

మాంత్రికుడు ఆవిడతో, "చూడండి, వదినా. మీరు మా అన్నను పెళ్లాడి, ఆయనతో కాపరంచేసిన ఇన్ని ఏళ్ల కాలంలోనూ నన్ను ఒక్కసారయినా చూడనందుకు మీరేమీ ఆశ్చర్యపడవద్దు. ఎందుచేతనంటే నేనీ దేశం విడిచిపెట్టి నలభై ఏళ్లయింది. నేను ఇండియా, ఇరాన్, అరేబియా, సిరియా, ఈజిప్టు మొదలైన దేశాలన్నీ తిరిగాను. కైరోనగరంలో చాలా ఏళ్లున్నాను. అటువంటి నగరం ప్రపంచంలో మరొకటి ఉండదనుకోండి. చిట్టచివరకు నేను మొరాకోదేశం చేరి, ముప్పై ఏళ్లుగా అక్కడే నివాసం ఏర్పరుచుకున్నాను. ఒకనాడు ఒంటరిగా కూచుని ఏదో ఆలోచిస్తూవుండగా చటుక్కున మన దేశమూ, మా అన్నా జ్ఞాపకం వచ్చారు. వెంటనే నాకాయనను చూడాలనిపించింది. ఏవేవో ఆలోచనలు వచ్చాయి. ఆయనను చూడకుండానే చనిపోతానేమోనని బెంగ పుట్టింది. దేవుడి కృప వల్ల నేను ఇంత ధనం సంపాదించుకున్నప్పటికీ, మా అన్న ఒకవేళ దారిద్ర్యంతో బాధ పడుతున్నాడేమోనని మరొక బెంగ పట్టుకున్నది. ఇంకేముందీ? వెంటనే బయలుదేరి చక్కా వచ్చాను! నేను దారిలో పడిన కష్టాలన్నీ ఇప్పుడు చెప్పటం దేనికిలే. ఎలాగైతేనేం, మొన్న ఈ నగరం చేరాను. వీధిలో వెళుతూండగా నాకు మన అలాదీన్ కొందరు కుర్రాళ్లతో ఆడుకుంటూ, కనిపించాడు. నమ్మండి, నమ్మకపొండి, వాణ్ణి చూస్తూనే గుర్తుపట్టాను. నా గుండె ఆనందంతో గంతులేసింది; కాని వాడు మా అన్న చచ్చిపోయినట్టు చెప్పగానే నాకు ఎక్కడలేని దుఃఖమూ వచ్చేసింది. అపుకో లేకపోయాను—బహుశా మనవాడు చెప్పే ఉంటాడు. అయినా మా అన్నకు ప్రతి



రూపంగా అలాదీన్ ఉన్నాడుగదా అని సంతోషించాను. ఎందుకంటే వాడు మూడు మూర్తులా మా అన్న పోలికే!" అన్నాడు.

ఈ మాటలన్నీ వింటూంటే అలాదీన్ తల్లికికూడా కళ్లు తడిఅయాయి. ఇది గమనించి మాంత్రికుడు ప్రసంగం మారుస్తూ, అలాదీన్‌తో, "నాయనా, అలాదీన్, నువు ఏం వృత్తి నేర్చుకున్నావు? నీ పొట్టపోసుకుంటూ నీ తల్లిని పోషించటానికిగాను ఏం పని చేద్దామనుకుంటున్నావు?" అని ఆప్యాయంగా అడిగాడు.

ఈ ప్రశ్న వినగానే అలాదీన్ తల వంచుకున్నాడు. తరవాత తన తల్లి అన్న మాటలకు వాడిమొహం సిగ్గుతో జేవురించింది.

"అడగక అడగక అలాదీన్‌మాటే అడిగావా, నాయనా? వాడికి ఒక్కటీ చేతగాదు. అంత పనికిమాలినవాణ్ణి నేనెక్కడా చూడలేదు. పోకిరీవెధవల నందరినీ చేర్చి అస్తమానం వీధుల్లో ఒకటే ఆటలు! వాడికి కుట్టుపని నేర్పుదామని వాళ్ల నాన్న పడిన పాట్లు ఇన్నీ అన్నీ కావు. వీడిమూలంగానే ఆయన ఆయుస్సు అర్థాయుస్సయిపోయింది. ఎప్పుడో నావంతుకూడా వస్తుంది. ఏం చెప్పేది, నాయనా? రాత్రీ పగలూ నేను నూలువడికినా మా పొట్టకు రెండు రొట్టెలు




దొరక్కుండా ఉన్నాయి. వీడు చూడబోతే తిండికోసం తప్ప ఇంటికి రాడు. వాడు అంత ఇల్లుపట్టకుండా తిరుగుతున్నాడు. చూసి చూసి వాణ్ణి వదిలేసి ఊరుకుందామనుకుంటున్నాను. వాడి పోషణ నావల్ల అయేటట్టు లేదు. వాడి పొట్ట వాణ్ణే పోసుకోనీ! నేను పెద్దదాన్నయిపోతున్నాను, ఒంట్లో శక్తి తగ్గిపోతున్నది!" అని అలాదీన్ తల్లి విసుక్కున్నది.

మాంత్రికుడు అలాదీన్‌కేసి తిరిగి, "ఇదేమన్నా బాగుందా, నాయనా? మీ నాయన కడుపున పుట్టి, మంచి తెలివితేటలు గల వాడివైవుండి ఇలా ప్రవర్తించవచ్చా? నువు ప్రయోజకుడివై మీ అమ్మను పోషించాలి



గాని, నీ బరువు మీ అమ్మను మొయ్యమన వచ్చునా ? చేసుకోదలిస్తే ఎన్నిరకాల పను లైనా ఉన్నాయి. నీ యిష్టంవచ్చిన పని నేర్చు కుంటానను; అది నీకు నేర్పించే భారం నాదీ! మీ నాన్నలాగా దర్జీపని చెయ్యటం ఇష్టంలేక పోతే ఇంకొకటి చూడు. నేను సహాయం చెయ్యటానికి సిద్ధంగా వున్నాను!" అన్నాడు.

దీనికి అలాదీన్ ఏ సమాధానమూ చెప్ప లేదు. వాడికి వళ్లువంచి పనిచెయ్యటం ఇష్టంలేదని మాంత్రికుడు గ్రహించి, "నీకు వృత్తివిద్యలు నేర్చుకోవటం ఒకవేళ ఇష్టం లేదూ, మానెయ్యి! దానికేం? నీకు మంచి బట్టల దుకాణం ఏర్పాటుచేసి అందులో సిల్కులు నింపేస్తాను. హాయిగా వ్యాపారం చేసుకో!" అన్నాడు.

ఈసారి అలాదీన్ ముఖం వికసించింది. మంచి మంచి బట్టలు ధరించి గల్లాపెట్టె దగ్గిర కూచుని వర్తకు డనిపించుకోవటం సరదాగా తోచింది. వాడు మాంత్రికుణ్ణి చూచి చిన్న నవ్వు నవ్వి, సరేనన్నట్టు తల ఆడించాడు.

"సరే, ఇంకేం ? రేపు నిన్ను బజారుకు తీసుకుపోతాను. గొప్ప వర్తకులు వేసుకునే దుస్తులు కొనిపెడతాను. ఆ తరవాత మంచి దుకాణం ఒకటి ఏర్పాటు చేస్తాను," అన్నాడు మాంత్రికుడు.

ఈ కొత్తబంధువు దేవుడల్లే తటస్థపడినం దుకు అలాదీన్ తల్లి ఎంతో సంతోషించింది. ఆయనను చాలాసేపు కొనియాడి, అలా దీన్‌తో, "మీ చిన్నాయన నీకోసం ఎంత శ్రమపడుతున్నాడో చూడరా! ఆయన పేరు నిలబెట్టటానికైనా ఇకనుంచి బుద్ధిగాఉండి, ఆయన చెప్పినట్టల్లా చెయ్యి," అన్నది.

తరవాత ఆమె వడ్డించింది. ముగ్గురూ తృప్తిగా భోజనం చేశారు. చాలాసేపు ఆ కబుర్లూ ఈ కబుర్లూ మాట్లాడి, మర్నాడు ఉదయం వస్తానని చెప్పి మాంత్రికుడు తన బసకు వెళ్లిపోయాడు. (ఇంకావుంది)



# సింహాన్ని ఎదిరించిన నక్క

ఒకనాడు అడవిలో ఎలుగుబంటి పుట్టినరోజు పండగ చేసుకుని తన కారు మృగాలన్నిటినీ విందుకు పిలిచింది. ఈ విందుకుగాను ఎలుగుబంటి అడవిలో ఉండే తాటిచెట్లన్నిటినుంచీ కల్లుతీసి బానలతో నింపి ఉంచింది.

అందరూ సుష్టుగా భోజనం చేశారు. తలా కాస్త తాటికల్లు తాగారు. నక్కమాత్రం కల్లు తెగతాగి, తూలుతూ నృత్యం చెయ్యసాగింది. జంతువులన్నీ దాన్నిచూసి నవ్వసాగాయి.

ఇదిచూసి నక్కకు కోపంవచ్చి, "నే నింటికి పోతున్నాను. నన్నెవరాపుతారో చూస్తాను!" అంటూ బయలుదేరింది. ఎలుగుబంటి నక్కతో, "తెల్లారి పోదువుగాని. ఈ అర్ధరాత్రివేళ సింహం గుహపక్కగా వెళ్లటం అంత క్షేమంకాదు!" అని బతిమాలింది.

కాని నక్క వినిపించుకోక, "ఏం సింహం? బోడిసింహం! దానితాట వొలిచేస్తాను! ఎవడనుకుందో!" అని కేకపెడుతూ బయలుదేరింది. అది దారిపొడుగునా తాగిన నిషాలో సింహాన్ని తిడుతూనే ఉన్నది.

గుహలో నిద్రపోతున్న సింహం ఈ కేకలకు లేచి, నక్కమాటలు ఆలకించి, కోపం వచ్చి, నక్క దారికి అడ్డంగా నిలబడి, "ఏమిటి పేలుతున్నావు?" అని హుంకరించింది.

సింహాన్ని చూడగానే నక్కనిషా అంతా దిగిపోయింది. "తమరా, మహారాజా! కొంచెం తాగిఉన్నాను. క్షమించండి!" అన్నది.

"తాగినందుకు ఇప్పుడే నీకు బుద్ధిచెబుతాను!" అన్నది సింహం.

"క్షమించండి, మహారాజా! ఇవాళ తమ పుట్టినరోజు పండగ! అందుచేత స్నేహితులం నలుగురమూ చేరి పండగ చేసుకున్నాం!" అన్నది నక్క.

"ఓహో, అదా సంగతి? అయితే వెళ్లిరా!" అంటూ సింహం నక్క వీపుమీద తట్టి, వెళ్లిపోనిచ్చింది.



# అద్భుత శక్తులు



విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, శవాన్ని దించి భుజాన వేసుకుని, మౌనంగా శ్మశానానికేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, కొందరు మనుషులు అద్భుత శక్తులు సంపాదించేటందుకు అడ్డమైన అగచాట్లూ పడతారు. కాని వాటివల్ల అనుకున్నంత సుఖం ఉండకపోగా, అప్పుడప్పుడూ అపకారంకూడా జరుగుతుంది. దీనికి గుణనిధి మంచి తార్కాణం. అతని కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

యమునానదీ తీరాన ఒక గ్రామంలో గుణనిధి అనే యువకుడుండే వాడు. అతనికి చిన్నతసంనుంచీ తత్వజ్ఞానంమీద ఎక్కువ ప్రీతి. అందుచేత అతను కాశీ నగరంలో తన చదువు పూర్తి అయినాక ఇంటికి తిరిగి వెళ్ళక, అక్కడవున్న గొప్ప

## బేతాళ కథలు

గొప్ప తత్వవేత్తలవద్ద సాంఖ్యశాస్త్రం మొద లైనవి చదవసాగాడు.

గుణనిధికి కాశీనగరంలో ఒక మిత్రుడు దొరికాడు. ఇతని పేరు జయువర్మ. జయు వర్మకూడా ఎక్కడినుండో వచ్చి కాశీలో ఉంటున్నవాడే. అతను పగలల్లా క్రయ విక్రయాలు చేసి కొంత డబ్బు సంపాదించు కుని, సాయంకాలంనుంచీ పాచికలు ఆడి, డబ్బంతా పోయాక ఇంటికి చేరేవాడు.

ఇద్దరికీ ఎందులోనూ పోలిక లేకపోయినా, గుణనిధీ జయువర్మల మధ్య మంచి స్నేహం కుదిరింది. వారిద్దరూ ఒక ఇంటనే బస చేసేవారు. జయువర్మ తన స్నేహితుణ్ణికూడా జూదం ఆడటానికి తీసుకుపోదామని చాలా సార్లు ప్రయత్నించాడు, కాని గుణనిధికి జూదంలో కొంచెమైనా ఆసక్తిలేదు. పైపెచ్చు అతను జయువర్మను, "నీకీ వ్యసనం ఎలా పట్టుకున్నది? సంపాదించిన డబ్బంతా ఎందుకిలా తగలేస్తున్నావు?" అని మంద లించేవాడు.

"డబ్బు శాశ్వతమా? వస్తుంది, పోతుంది! కాని అదృష్టదేవతను నీకు అనుకూలంగా చేసుకోవటంలో ఎంతో ఆనందం ఉంది! అది నీకు అనుభవంమీదగాని తెలియదులే!" అనేవాడు జయువర్మ.



కాని ఆ అదృష్టదేవత ప్రతి రోజూ అత నికి ప్రతికూలంగానే ఉండేది. ఒక్కనాడు కూడా అతను జూదంలో గెలిచి ఇంటికి రాలేదు. ఓడి డబ్బు పోగొట్టుకుంటున్న కొద్దీ జయువర్మకు వ్యసనం జాస్తి అయింది గాని తగ్గలేదు.

చివరకు ఒకనాడు అతను గుణనిధితో, "ఒక్కసారి నువుకూడా నావెంట వచ్చా వంటే నా అదృష్టం మారవచ్చు. నువు జూదం ఆడవద్దు, నా పక్కనే ఉండు, చాలు!" అన్నాడు. అతని మాట తీసివెయ్య లేక గుణనిధి అతనివెంట జూదం ఆడే చోటికి వెళ్లాడు.

జయవర్మ కొంతడబ్బు తీసి చేతపట్టుకుని, "ఈ డబ్బు ఏం పందెంమీద కాయమన్నావు? నీ ఇష్టంవచ్చిన పందెం చెప్పు," అని గుణనిధిని అడిగాడు. గుణనిధి తన నోటికి వచ్చిన పందెం చెప్పాడు.

జయవర్మ అప్రకారమే దానిమీద డబ్బు పెట్టాడు. పాచికలు విసరగానే గుణనిధి చెప్పిన పందెం వచ్చింది. జయవర్మ చాలా డబ్బు గెలిచాడు.

"ఇంకో పందెం చెప్పు!" అన్నా డతను. గుణనిధి అనుకోకుండానే అతని నోటివెంట ఏదో సంఖ్య వచ్చింది. మళ్ళీ గెలుపు జయవర్మదే. అర్ధరాత్రి అయేదాకా జయవర్మ జూదం ఆడాడు. ప్రతిసారీ పందెం చెప్పటం గుణనిధి వంతూ, డబ్బు గెలుచుకోవటం జయవర్మ వంతూ అయింది. అదేం చిత్రమో, గుణనిధి నోటివెంట ఏ పందెం వస్తే పాచికలలో అ పందెమే పడింది. జయవర్మ ఆ రాత్రి వెయ్యి వరహాలకు పైగా గెలుచుకుని ఇంటికి వచ్చాడు. అతను గుణనిధిని కౌగలించుకుని, "మిత్రమా, నువు నాపాలిటి పెన్నిధివి! మనమిద్దరమూ ఏకమైతే కాశీనగరమంతా జయించగలం!" అన్నాడు సంతోషపడుతూ.

గుణనిధికి జూదంలో ఏమాత్రమూ ఆసక్తి లేకపోయినా, తన స్నేహితుడి ఆనంద



పారవశ్యం చూస్తూవుంటే అతనికికూడా చాలా సంతోషం కలిగింది.

అదిమొదలు జయవర్మ రోజూ గుణనిధిని తనవెంట జూదానికి రమ్మని వేధించసాగాడు. మొదట కొద్దిరోజులు గుణనిధి అతని మాట తీసివెయ్యలేక వెళ్ళాడు. అందువల్ల జయ వర్మకు పూర్తిగా లాభించింది. గుణనిధిలో ఏదో ఒక అద్భుత శక్తి ఉన్నట్టు స్పష్ట మయింది; ఎందుచేతనంటే, అతని నోటి వెంట వచ్చే పందెం నెగ్గితీరేది. ఈ శక్తి తనలో ఎప్పుడు ప్రవేశించినదీ గుణనిధికే తెలియదు. "ఏం పందెం కాయమన్నావు?" అని జయవర్మ అడిగిన మరుక్షణం, అతని చెవిలో ఏదో వినిపించినట్టయేది; వెంటనే అ పందెమే అతను పైకి అనేసేవాడు; అది కాస్తా నెగ్గేది.

రోజూ జయవర్మ వేలకువేలు గెలు స్తున్నాడు. అందులో సగం భాగం అతను గుణనిధికి ఇచ్చేసేవాడు. జూదమనే వ్యసనం ఏర్పడనేగూడదుగాని, గెలిచినా ఓడినాకూడా అది మనిషిని మరింతగా పట్టుకుంటుంది. జయవర్మ ఈ వ్యసనంతో వెర్రివాడులా అయిపోయాడు. అతను వ్యాపారం మానేసి, పగలూ రాత్రీ జూదపుటిళ్లలో గడపసాగాడు. తనతోబాటు గుణనిధినికూడా నిర్బంధంగా తీసుకు వెళ్లేవాడు.





గుణనిధి చదువు పాడుకాసాగింది. తన కాలమంతా దుర్వినియోగమైపోతున్నందుకు అతను బాధపడసాగాడు. అతను ఒకనాడు జయవర్మతో, "ఈ జూదంలో నువు ఇప్పటికే చాలా గెలుచుకున్నావు. ఇకనైనా మానరాదా? కావలిస్తే నా వంతు సొమ్ముకూడా తీసుకో. నాకా డబ్బు అనవసరం. నువు ఏదోవిధంగా జీవితంలో స్థిరపడిపో. ఇంకెంత కాలం నీ జీవితాన్ని ఇలా వ్యర్థంచేస్తావు?" అని మంచిగా చెప్పాడు.

"దొరకక దొరకక ఇటువంటి గొప్ప అవకాశం దొరికితే దాన్ని పోగొట్టుకుంటామా? నీలో ఉండే ఈ అద్భుతశక్తి రేపు పోవచ్చు. దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి. నువ్వయినా నీ శక్తిని వుపయోగించుకోకుండా, వృథాపోనివ్వటం ధర్మం కాదు!" అని జయవర్మ జవాబిచ్చాడు.

తన మిత్రుడు తనను సులువుగా వదలడని గుణనిధికి తెలిసిపోయింది. అతను జయవర్మకు గల వ్యసనాన్ని పోగొట్టటందుకుగాను చాలా యుక్తులు పన్నాడు. "ఏం పందెం కాయమంటావు?" అన్నప్పుడు గుణనిధి, "నాకేమీ తట్టటంలేదు," అనేవాడు అమాయికంగా.

వెంటనే జయవర్మ ఆట మానేసి, అతను పందెం చెప్పేసదాకా ఆడేవాడుకాడు.





జయవర్మ నాలుగైదుసార్లు ఓడితే తన అద్భుతశక్తియందు అతనికి గల నమ్మకం పోతుందనే నమ్మకంతో, గుణనిధి ఒకనాడు తనకు తట్టిన పందెం తప్పించి ఇంకో పందెం మీద తన మిత్రుణ్ణి డబ్బు కాయమన్నాడు. జయవర్మ అలాగే చేశాడు. కాని గుణనిధి నోటివెంట వచ్చిన పందెమే నెగ్గింది; జయవర్మ గెలిచాడు!

జూదంలో గెలిచి జయవర్మ ఉత్సాహం హెచ్చిపోతున్నకొద్దీ, గుణనిధికి తన చదువు పాడై, నిరుత్సాహం హెచ్చిపోసాగింది. త్వరలోనే అతనికి చదువుమీదా, కాశీనగరం మీదా, తన స్నేహితుడైన జయవర్మమీదా, జూదంమీదా భరించరానంత అసహ్యం పుట్టింది. అతను తన స్వగ్రామానికి వెళ్లి తనవారి మధ్య ఎప్పుడు పడతానా అని కలవరించసాగాడు.

తాను వెళ్లిపోతానంటే జయవర్మ పోనివ్వడు; జూదం మానెయ్యమంటే చెవిని పెట్టడు. అందుచేత ఒకరోజు వేకువ జామున లేచి గుణనిధి గంగానది ఒడ్డుకు చేరాడు. అక్కడ ఒక పడవవాణ్ణి నిద్రలేపి, "నన్ను అవతలి తీరం చేర్చు, నీకు కావలిసినంత డబ్బిస్తాను!" అన్నాడు.

గంగ పూటుగా ప్రవహిస్తున్నది. అయినా డబ్బుకు ఆశపడి పడవవాడు గుణనిధిని



ఎక్కించుకున్నాడు. పడవ అవతలి గట్టుకు ప్రయాణమయింది.

గుణనిధి లేచిన కొద్దిసేపటికే జయవర్మకు మెలుకువ వచ్చింది. తన స్నేహితుడు తనతో చెప్పకుండా వెళ్లిపోయాడని అతనికి అనుమానం తట్టింది. అతనుకూడా గంగానది ఒడ్డుకు పరిగెత్తివెళ్ళి, నడిప్రవాహంలో ఉన్న పడవలో గుణనిధి ఉన్నట్టు తెలుసుకుని, కేకలుపెట్టాడు.

"నేను మా దేశానికి వెళ్లిపోతున్నాను. తిరిగిరాను!" అని గుణనిధి నిర్మోహమాటంగా జవాబు చెప్పాడు.

జయవర్మ ఇటూఅటూ చూశాడు. సమీపంలో పడవలేమీ లేవు. అతనికి ఈత వచ్చును. అందుచేత సాహసించి అతను గంగలో దూకి గుణనిధి వెనకగా ఈద సాగాడు. అతను గంగ నడిమధ్యకు చేరుకునే లోపుగానే మొసలి ఒకటి అతన్ని పట్టి నీటి అడుగుకు లాక్కుపోయింది.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, జయవర్మ చావుకు కారణమేమిటి? అతని వ్యసనమా? అతని ధనాశా? లేక, గుణనిధికి గల అద్భుతశక్తా? గుణనిధి చేసిన మిత్రద్రోహమా? సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది!" అన్నాడు.

"జయవర్మ చావుకు కారణం ఇవేవీ కావు. జూదం ఆడేవాళ్లూ, ధనాశాపరులూ ప్రపంచంలో చాలామంది ఉన్నారు. గుణనిధికి గల అద్భుతశక్తి జయవర్మకు మేలు చేసిందిగాని కీడు చేయలేదు. నిజానికి తప్పు జయవర్మదే. అతను చేసిన తప్పేమిటంటే, గుణనిధియొక్క స్వాతంత్ర్యాన్ని అరికట్టాడు. ఒకరి స్వాతంత్ర్యాన్ని అరికట్టేవాళ్లు తప్పక కీడుపొందితీరుతారు. జయవర్మకు అదే జరిగింది!" అన్నాడు విక్రమార్కుడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. (కల్పితం)






## 3

[ట్రోయ్‌నుంచి ఇంటికి బయలుదేరిన రూపధరుడు తుఫానులో చిక్కుకుని ఫాలలోచనులనే ఒంటికంటి రాక్షసులుండే దీవికి చేరుకున్నాడు. అతను పన్నెండుమంది అనుచరులతో సహా ఒక ఫాలలోచనుడి గుహలో చిక్కుకుపోయాడు. ఆ రాక్షసుడు అతని అనుచరులలో కొందరిని చంపి తినేశాడు. చిట్టచివరకు రూపధరుడు తన యుక్తి చేత ఆ రాక్షసుడి కన్ను పొడిచి, తన అనుచరులతో సహా బయటపడ్డాడు. తరవాత అతని నౌకలు ఆ దీవిని వదిలి ప్రయాణం సాగించాయి.]

రూపధరుడి నౌకలు త్వరలోనే నౌకా ద్వీపాన్ని చేరుకున్నాయి. ఈ ద్వీపం సముద్రంపైన తేలి ఉంటుందని ప్రతీతి. దీనిపైన ఒక అభేద్యమైన కంచుకోట ఉన్నది. ఈ కోటలో ఏతే రాజుపేరు చిత్రాశ్వుడు. దిక్పాలకులు ఈయనకు మిత్రులు. ఈయనకు ఆరుగురు కుమారులూ, ఆరుగురు కుమార్తెలూ ఉన్నారు.

ఈ చిత్రాశ్వుడు రూపధరుడికీ, అతని అనుచరులకూ స్వాగతమిచ్చి వారిని ఒక మాసంపాటు తన అతిథులుగా ఉంచుకున్నాడు. ట్రోయ్‌యుద్ధం గురించీ, ఆ యుద్ధంలో విజయం పొందిన గ్రీకువీరులను గురించీ ఆయన రూపధరుడిద్వారా విపులంగా తెలుసుకున్నాడు. మాసం రోజులూ ఇలాగే గడిచిపోయాయి.

గ్రీకు పురాణగాథ





చివరకు ఒకనాడు రూపధరుడు చిత్రాశ్వుడితో, "మేము ఇంకెంత కాలం మీకు అతిథులుగా ఉండం? మాకు సెలవిప్పించండి. అంతేకాదు, మా ప్రయాణం సక్రమంగా సాగగలందులకు మీరు చేతనైన సహాయం యావత్తూ చేయాలి. మేమిప్పటికే సముద్రాలమీద చాలా కష్టాలు పడి ఉన్నాం," అన్నాడు.

చిత్రాశ్వుడిందుకు ఒప్పుకున్నాడు. వాయుదేవుడి వరంవల్ల ఈ చిత్రాశ్వుడికి సప్తమారుతాలూ లోబడి ఉంటాయి. అందుచేత అయన ఒక్క మారుతాన్ని తప్ప మిగిలిన ఆరు మారుతాలనూ ఒక తోలుతిత్తిలో దిగ్బంధంచేసి, ఆ తిత్తిని రూపధరుడికిస్తూ, "నాయనా, నీ పడవలను సురక్షితంగా మీదేశం చేర్చటానికి ఉపయోగపడే ఒక్క మారుతాన్ని మాత్రం విడిచిపెట్టి, మిగిలినవాటిని ఈ తిత్తిలో ఉంచాను. అందుచేత నీ ప్రయాణం సూటిగా సాగుతుంది. ఇంటికి చేరినదాకా ఈ తిత్తిలో ఉండే మారుతాలు పైకి రాకుండా కాపాడుకుంటే చాలు, నీకు ఎట్టిఆపదా జరగదు!" అని చెప్పాడు.

రూపధరుడు అయనకు కృతజ్ఞత తెలుపుకుని, మారుతాలు గల తిత్తిని తన వద్దనే ఉంచుకుని, తన అనుచరులతో సహా నౌకలలో బయలుదేరాడు. చిత్రాశ్వుడు చెప్పినదంతా అక్షరాలా జరిగింది తొమ్మిదిపగళ్లూ, తొమ్మిదిరాత్రులూ అగకుండా ప్రయాణం జరిగింది. పదవనాటి ఉదయం సముద్రంమీద ఇథకాతీరం కనిపించింది. ఆ తీరాన గల చలిమంటలను కూడా రూపధరుడు పోల్చగలిగాడు.

తిరిగి స్వదేశం కళ్లబడగానే రూపధరుడికీ, అతని అనుచరులకూ కలిగిన ఆనందానికి మేరలేదు. ఇంక కొద్ది గడియలలో నౌకలు తీరాన్ని చేరుకుంటాయి ఆ తరవాత ఎవరి ఇళ్లలో వారుంటారు!





నౌకాద్వీపాన్ని వదిలాక రూపధరుడు కన్నుమూసి ఎరగడు. మారుతాలు గల తిత్తిని భద్రంగా తన చేతుల్లోనే ఉంచుకుని, తొమ్మిదిరోజులూ కాపాడాడు. "ఇంక ఇంటికి చేరినట్టే!" అన్న ధిలాసా మనసుకు తోచేసరికి, అతనికి ఎక్కడలేని నిద్రా ముంచుకువచ్చింది. తమ నౌకలు అన్నీ తీరాన్ని చేరేలోపుగా కొంచెంసేపుపాటు ఒక్క కునుకు తీద్దామనుకుని రూపధరుడు నడుమువాల్చాడు.




అతను కన్నుమూశాడో లేదో, అవెంటనే అతని అనుచరులలో గుసగుసలు బయలుదేరాయి.

"ఆ తిత్తిలో ఏముంటుందంటావు?" అన్నాడొకడు.

"ఇంకేముంటుంది? బంగారమూ, రకరకాల బహుమానాలూనూ!" అన్నాడు ఇంకొకడు.

"ఈ రూపధరుడికి అందరూ స్నేహితులే! అందరూ బహుమానాలిచ్చేవారే! మన మొహాల నేమీ లేదు," అన్నాడు మూడోవాడు.

"అది కాదురా! ఈయనగారితోబాటు మనమూ పదేళ్లపాటు ఇల్లూవాకిలీ వదిలి, పెళ్లాంబిడ్డలకు దూరమై, యుద్ధంచేశాం గదా, అక్కడ దోచుకున్నదాన్లో ఎంతవంతు తీసుకుని ఇంటికి వస్తున్నాడో చూడు! మనమేమో వట్టిచేతులతో వస్తున్నాం! ఆ దోపిడీ చాలక ఈయనకు దారిపొడుగునా బహుమానాలు కూడానూ!" అన్నాడు నాలుగోవాడు.

"అసలా తిత్తిలో ఏముందో చూద్దాం రా!" అన్నాడు అయిదోవాడు.

ఇందుకు అందరూ సరేనంటే సరేనన్నారు. తిత్తి మూతి వెండితీగెతో చాలా గట్టిగా బిగించి ఉంది. రూపధరుడి అనుచరులు ఎంతో కష్టపడి ఆ తీగెను ఒక్కొక్క చుట్టే ఊడదీశారు.



అంతలోనే ఆ తిత్తి మూతినుంచి కాల వాయువులు భయంకరమైన వేగంతో, చప్పుడుతో బయటికి వచ్చేశాయి. ఆ గాలుల ధాటికి పడవలన్నీ భయంకరంగా ఊగిసలాడిపోయాయి. పడవల్లో ఉండే వాళ్లు చెట్లు విరిగిపడ్డట్టు పడిపోయి, మొహాలు చేతులతో కప్పుకున్నారు.

ఈ ప్రళయఘోషకు రూపధరుడు నిద్ర లేచాడు. కాని అతను కళ్లు తెరవలేక పోయినాడు, ఏమి జరుగుతున్నదీ చూడలేక పోయినాడు. ఈ ఝంఝామారుతం ఉధృతం తగ్గిపోయేసరికి రూపధరుడి నౌకలు తిరిగి నౌకాద్వీపతీరాన్ని మరొకసారి చేరుకున్నాయి. రూపధరుడి అనుచరులు, కళ్లకు కనిపించిన మాతృదేశం మళ్లీ దూరమైపోయినందుకు పెద్దపెట్టున ఏడ్చారు. ఇక రూపధరుడి నిస్పృహ చెప్పనలవికాదు.

కాని ఏడ్చి లాభంలేదు, జరగవలిసిన పొరపాటు జరిగే పోయింది. రూపధరుడూ అతని అనుచరులూ మంచినీరు చేరవేసుకుని, వంటలు చేసుకుని తిన్నారు. తరవాత రూపధరుడు తనవెంట మరి ఇద్దరిని తీసుకుని చిత్రాశ్వుడివద్దకు వెళ్లాడు.

ఆయన ఆశ్చర్యంతో, "నువు బయలుదేరి నీ దేశానికి వెళ్లటానికి తగిన సహాయం

నేను చేస్తినిగదా, మళ్లీ ఇలా వచ్చావేమిటి?" అని అడిగాడు.

"మహారాజా, ఏం చెప్పను? బుద్ధి పొరపాటున క్షణంసేపు కన్ను మూశాను. వెంటనే మూర్ఖులు, నా అనుచరులు, తిత్తి విప్పి మారుతాలను వదిలిపెట్టారు. మీరు శక్తిమంతులు, నాకు మళ్లీ సహాయపడి పుణ్యం కట్టుకోండి!" అన్నాడు రూపధరుడు.

"ఛీ, పాపీ! తక్షణం నా ద్వీపాన్ని వదిలి వెళ్లిపో! దేవతలు నీమీద కత్తికట్టారు! అలాటివాడికి నేను ఎంతమాత్రమూ సహాయపడలేను!" అని చిత్రాశ్వుడు రూపధరుణ్ణి నిర్దయగా తరిమేశాడు. రూపధరుడు ఎంత బతిమాలికూడా ఏమీ లాభం లేకపోయింది.

నౌకలు తిరిగి ప్రయాణం సాగించాయి. కాని ఎవరిలోనూ కొంచెంకూడా ఉత్సాహం లేదు. గాలి సహాయం కొంచెంకూడా లేని కారణంచేత నావికులు చేతులు పడిపోయేలాగ తెడ్లు వేయవలిసివచ్చింది.

విరామం అన్నది లేకుండా ఆరు రోజులపాటు రాత్రిం బగళ్లు సముద్రం మీద ప్రయాణంచేసి రూపధరుడి బృందం చివరకు ఒక విచిత్రమైన తీరాన్ని చేరారు. ఇది ఉత్తరధృవ ప్రాంతం. ఇక్కడ








మాసాలతరబడి పగలుంటుంది. సూర్యుడు అస్తమించిన కాస్సేపటికే మళ్లీ ఉదయిస్తాడు; ఎక్కడ అస్తమిస్తాడో, మళ్లీ ఎక్కడ ఉదయిస్తాడో కొత్తవాళ్లు ఊహించనుకూడా లేరు.

రూపధరుడి నౌకలు తీరాన్ని తాకిన చోట దగ్గిర దగ్గిరగా రెండు కొండ శిఖరాలున్నాయి. వీటి మధ్యగా ఒక్క పడవ మాత్రమే పోయే వీలున్నది. కాని వాటి సందుగా వెళితే అవతల సముద్రం సరస్సు ఆకారంలో విశాలంగా వున్నది. అది పడవలకు మంచి రేవుకూడానూ. మిగిలిన పడవలను రేవులోకి పోనిచ్చి రూపధరుడు తన పడవను మాత్రం బయటి తీరానే గల కొండరాళ్లకు కట్టిపెట్టాడు.

ఆ తరవాత అతను తన సమీపానే వున్న ఒక శిఖరం ఎక్కి చుట్టూ కలయచూశాడు. కనుచూపుమేరలో ఎక్కడా పచ్చికగాని, ఒక చెట్టుగాని అతనికి కనబడలేదు. కాని చాలా దూరాన ఆకాశంలోకి పొగలేస్తూండటం అతనికి కనిపించింది. ఆ ప్రాంతాల ఎవరో మనుషులుంటున్నట్టు స్పష్టం కావటంవల్ల అతను తన అనుచరులలో ముగ్గురిని పంపుతూ, "మీరు ఆ పొగ కనిపించే దిక్కుగా వెళ్లి ఇక్కడ ఎటువంటి మనుషులు నివసిస్తున్నారో తెలుసుకు రండి!" అన్నాడు.

వారు కొంత దూరం వెళ్ళేసరికి ఒక బళ్లదారిలాటిది కనిపించింది. దానివెంబడే వెళ్ళగా కొన్ని ఇళ్లు వచ్చాయి. ఈ ఇళ్ళకు ఇవతలగా ఒక పిల్ల సెలయేట్లో నీరు తీసుకుంటూ వారి కంటపడింది. "ఈ ఊరికి రాజెవరు? ఆయన ఉండే ఇల్లేది? మేము ఆయనను కలుసుకోవాలి," అని రూపధరుడి అనుచరులా పిల్ల నడిగారు. ఆమె వారి ప్రశ్నకు సమాధానంగా, అంత దూరాన కనిపించే ఒక ఎత్తయిన ఇంటి కప్పు చూపింది.

వారా ఇంటికి వెళ్లి లోపల అడుగు పెట్టేసరికి ఎదురుగా ఒక రాక్షసిలాటి స్త్రీ కనిపించింది. ఆమెను చూస్తేనే వారికి వికారం కలిగింది.

ఆ స్త్రీ అప్పటికప్పుడే ఎవరినో పంపి తన భర్తను పిలిపించింది. వాడు వస్తూనే రూపధరుడి అనుచరులలో ఒకణ్ణి పట్టుకుని నేలకేసి కొట్టి చంపి వంటఇంటోకి గిరవాటు వేశాడు. ఇది చూసి మిగిలిన ఇద్దరూ అక్కడినించి కంగారెత్తి పారిపోయి తమ నౌకలను చేరుకున్నారు.

అయితే ఈలోపునే ఆ రాక్షసుడు వీధిలోకి వచ్చి పెద్దపెట్టున సింహనాదం చేశాడు. అది వినగానే వేలకొద్దీ రాక్షసులు ఎక్కడెక్కడినుంచో పరిగెత్తుకుంటూ వచ్చి రేవు చుట్టూ ఉండే కొండలమీదినుంచి రేవులో వున్న పడవలమీదికి రాళ్ళు రువ్వసాగారు. ఆ రాళ్ళు మనిషి కష్టంతో ఎత్తగలిగినంత బరువున్నాయి.

రేవులో వున్న పడవలన్నీ భగ్నమయాయి. రూపధరుడి అనుచరులు రాళ్ళ కిందనలిగి పోయారు. ఆ రాక్షసులు కేకలుపెడుతూ వారిని తమ ఈటెలకు గుచ్చి ఎత్తి ఇళ్ళకు పట్టుకుపోయారు.

రేవులో జరుగుతున్న దారుణ హత్యాకాండను గమనించి ప్రమాదం తెలుసుకుని రూపధరుడు తన పడవ తాళ్ళను కత్తితో కోసి, ఆ పడవలో ఉన్నవాళ్ళతో, "తెడ్లు వెయ్యండి! బలంకొద్దీ వెయ్యండి! లేకపోతే ప్రాణాలు దక్కవు!" అని బిగ్గరగా అరిచాడు.

వాళ్లుకూడా ఎక్కడలేని సత్తువా తెచ్చుకుని తెడ్లువేసి పడవను సముద్రంమీద తోసుకు పోయారు. ఆ నౌక తప్ప రూపధరుడి మిగిలిన నౌకలన్నీ నాశనమయాయి; వాటిలో ఉన్న గ్రీకులందరూ ఘోర మరణం పాలయారు.

(ఇంకా వుంది)





# మిత్రభేదం

కరటకుడు :

ఉండెను వానర - మ్మొక రాజునొద్ద
దండిమిత్రము సేవ-కుండును నగుచు.
అంతఃపురమ్మున - సడ్డంకి లేక
అంతయు తానైయై - అలరుచునుండె.
ఒకపరి నిద్రించు-చుండెను రాజు
చకచక కోతి వి-సరుచుండె తాను.
వ్రాలిన దీగ భూ-పతి రొమ్ము మీద
గాలి వీచిన నది - కదలనేలేదు.
రుసరుసలాడుచు - బిసబిస బాకు
కొసతోన బొడిచె నా - కోతి కోపించి
తుఱ్ఱున ఈగ ఏ - త్రోవనో వెళ్ళె
మొఱ్ఱోయనుచు రాజు - మూల్గుచు చచ్చె.
కావున మూర్ఖుడౌ - సేవకు డెపుడు
చావు దెచ్చును రాజు - చాయల నున్న.
మఱిఒక్క ఊర బ్రా-హ్మణుడొక్కడుండు
పరమపండితుడయ్యు - వరచోరు డతడు.
అచటికి వ్యాపారు-లైన బ్రాహ్మణులు
ఎచటినుండియొ వచ్చి - ఎసగుచున్నారు.
తళతళ లీను ర-త్నాలు ముత్యాలు—
తళుకుమన్నవి మన - తస్కరు కండ్లు
మెల్లగా మాటల - మించిన అతడు
వల్లించి ఏవేవొ - వారి మెప్పించె
పనిపాట సేయువా-నిని వోలె చేరి
వినయమ్ముతో వారి - విశ్వాసమంది
పని పూర్తిసేసి ఆ-బాపలు ధనము
గొని చనుచుండ వా-డును బయల్దేరె.
"ఇన్ని రోజులు ఒక్క-టే అయియుండి
ఉన్నాము మీరిప్పు - డూరికి నేగ
విడిచి నేనుండగా - ఎడద వెన్కాడు
నడచెద మీతోడ - నని తోడు చనియె.
కానలో బోవుచు - నా నల్గురితడు
లోన బోయలపల్లె-లో దూరి చనగ
కాకి వారికి చెప్పె - కడు ధనుల్ వీరు

విద్వాన్ విశ్వం



మూకగా వెళ్ళి దా-రీక కొండనుచు
బోయలు వచ్చి, ల-బోదిబోమన్న
పాయక బడితెల - బాది చూడగను
పిక్కలలో దాచి-పెట్టిన మణులు
ఒక్కటికూడ వీ-చక్కి కన్పడును.
కాకి చెప్పిన మాట - కా దబద్ధమ్ము
మీకున్న ధనమిందు - లేకున్న చత్తు
రని వారు బెదిరింప - ననుకొనె వీడు
వినక వీరల చంపి-వేతురే అనుచు
తాను వారల దారి - తప్పించి చంపి
అ నగ దంతయు - నడచి పుచ్చుకొను
ఆసతో వచ్చుచు-న్నాడయ్యు నపుడు
కాసింత గుండెలో - కరుణ నీరాడె.

తోలు తీసెదమంచు - దొంగలన్నారు.
తోలు తీసిన రాలు - చాల రత్నాలు
తనవద్ద మాత్రమే - దమ్మిడి లేదు
అని చూచి వాడనె - నా బోయ బిలిచి
తొందర యేల నా - తో లీసి కనుడు
ముందర మావద్ద - ముల్లెయే లేదు.
అన్నంత వారలా - యయ్యా చర్మమ్ము
తిన్నగా ఒల్చి 'ఏ-మిన్ని' లేదనుచు
మిగతవారిని పొందు - మేలని చనిరి.
పగవాడు తెలివైన-వాడైన మేలు

* * *

అను మాటకీ కథ - అద్భుత సాక్షి
వినుమోయి దమనకా - వీఁడి వీవు.

* * *

కరటక దమనకుల్ - సరి యిట్టులుండ
దొర గిత్త జంపి నె-త్తురుచూచి ఏడ్చె.

పింగళకుడు :

ఏమి చేసితి నిది - యెంత పాపమ్ము
సామాన్యుడా కాడు - సంజీవకుండు.
నమ్మిన మిత్రుని - నాశమ్ముచేసి
ఇమ్మహి నేనేమి - యేలుకోగలను?
మేలు చేసినవాని - మ్రింగెడువాడు
మేలైన మిత్రుని - మ్రింగెడువాడు
నమ్మినవాని వె-న్కన చంపువాడు
నిమ్మహి నరకమ్ము-నే పొందగలరు.

నేల పోయిన రాజు - నిజము నశించు
చాలిన మిత్రుడు - సమసిన నంతె.
నేల పోయిన తిరు-గా లభియించు
చాలిన మిత్రుడు - సమసిన రాడు.
అని యేడ్చుచున్న రా-జును చేరవచ్చి
అనినాడు దమనకుం - డాశ్వసించుచును.

దమనకుడు :

రాచవారికి నేడ్వ - నేచక్క తగదు
మీ చిత్త మిటు బాధ - గ్రమింగుట యేల ?
పితయైన సహజన్ము - డతగాడె యైన
మిత్రద్రోహి జంపుట - మనకు ధర్మమ్ము
పచ్చిక మేసెడు - పశువు, మాంసమ్ము
పచ్చిది తినువారి - పగదాయ సుమ్ము.
సామాన్య నీతికి - సరికానివయ్యు
భూమీశు నీతికి - పోలును కొన్ని.
భయముతోడనె ప్రజ - భక్తితో మ్రొక్కు
నయశాస్త్రరీతి యీ-నాటికి నిదియె.
నాగుల పూజింత్రు - నరులు లోకమున
ఆ గరుత్మంతుని - అనుకోరు నిజము.
చచ్చినవారికై - చనదు చింతింప
పచ్చుపోవును ప్రాణ-వర్తన మిదియె
పోయినవా డెటు - పోవనేపోయె
వాయి విచ్చిన వచ్చు - వరుమానమేమి ?
అనుచు నా దమనకుం - డది యిది చెప్పి
తన రాజునకు ధైర్య-మును నూరిపోసి
కన్నీరు దుడిచి చ-క్కగ ఊరడించి
మన్నిడ రమ్మని - మట్టిని జేర్చె.
అక్కడ జంతువు - లన్నిటి జేర్చి
మక్కువతో రాజు - మనసును మార్చి
దమనకుం డే మంత్రి - తన కనిపించి
కుమతి వాడే అర-ణ్యము నేలసాగె.
తనకు కానట్టివా-రిని చీలదీసి
తన కోర్కె పూరించు - తంత్ర మియ్యదియె
పంచతంత్రమ్మున - ప్రథమతంత్రమ్ము
మిం చిది ముగిసెను - మిత్రభేదమ్ము.

★ మిత్రభేదము సమాప్తం ★





# దోసకాయల బేరం

పూర్వం ఒక సుల్తానుండేవాడు. ఆయన ఒకనాడు వేటకు బయలుదేరి పోతూ ఉండగా, దారిలో అడవిమధ్య ఆయనకు ఒక రైతు కనిపించాడు. ఆ రైతు ఒక గాడిదను తోలుకుంటూ వస్తున్నాడు. దాని మీద ఏదో మూట వున్నది.

సుల్తాను తన గుర్రాన్ని ఆపి రైతును పలకరించి, "తమ్ముడూ, ఆ మూటలోవి ఏమిటి?" అని అడిగాడు.

"బాబూ, ఇవి దోసకాయలు. నా తోటలో కాసిన తొలికాపు. తరుణానికి ముందే కాశాయి. అందుకని వీటిని తీసుకుపోయి సుల్తానుగారికి అమ్ముకుందామని బయలుదేరాను. ఆయన గొప్ప దాత అని చెబుతారు. మంచి ధర ఇస్తారని ఆశగా వుంది," అన్నాడు రైతు. వాడు సుల్తానును పూర్వం ఎన్నడూ చూసివుండని కారణంచేత గుర్తించలేకపోయాడు.

"సుల్తానుగారు నీ దోసకాయలకు ఏపాటి ఇస్తారనుకుంటున్నావు?" అని సుల్తాను రైతును అడిగాడు.

"కనీసం వెయ్యి బంగారు దీనారాలన్నా ఇవ్వకపోతారా?" అన్నాడు రైతు.

"అది చాలా జాస్తి అని సుల్తాను అంటే ఏంచేస్తావు?" అని సుల్తాను అడిగాడు.

"పోనీ అయిదు వందలే ఇయ్యమంటాను!" అన్నాడు రైతు.

"అదీ ఎక్కువేనంటే?"

"మూడు వంద లియ్యమంటాను."

"అదీ ఎక్కువేనంటే?"

"వంద ఇయ్యమంటాను."

"అదీ ఎక్కువేనంటే?"

"యాభై అడుగుతాను."

"అదీ ఎక్కువేనంటే?"

"ముప్పై అడుగుతాను."

"అదీ ఎక్కువేనంటే?"

ఆర్. అనంతరామారావు

"నా గాడిదను ఆయన సింహాసనంమీదికి తోలి, పారిపోతాను," అన్నాడు రైతు.

సుల్తాను విరగబడి నవ్వి రైతును వెళ్ళి పోనిచ్చాడు. తరవాత ఆయన వేట మానేసి ఇంకొక దారిన ఇంటికి తిరిగి వచ్చేశాడు. వస్తూనే ఆయన ద్వారపాలకులతో, "నాకోసం ఒక రైతు గాడిదతో సహా ఇక్కడికి వస్తాడు. వాణ్ణి ఆపకుండా నేరుగా నావద్దకు రానివ్వండి!" అని చెప్పాడు.

ఒక గంటకల్లా రైతు గాడిదను తోలుకుంటూ ద్వారంవద్దకు వచ్చి సుల్తానుగారి దర్శనం కావాలని కోరాడు. ద్వారపాలకులు వాణ్ణీ, గాడిదనూ లోపలికి పోనిచ్చారు.

దుస్తులు మార్చుకుని తనకోసం హాలులో వేచివున్న సుల్తానును చూసి రైతు గుర్తించ లేదు. వాడు దోసకాయల మూటను చేత పట్టుకుని సుల్తాను ముందు ఎంతో విధేయతగా నిలబడ్డాడు.

"నా కోసం ఏదో తెచ్చినట్టున్నావే? ఏమిటోయ్ అవి?" అని అడిగాడు సుల్తాను.

"ఏలినవారు అనుగ్రహిస్తే, నా తోటలో కాసిన తొలికాపు దోసకాయలు ఇచ్చుకుందామని తెచ్చాను," అన్నాడు రైతు.

"భేష్! నా అనుగ్రహం ఎంతదాకా ఉండాలని నీ ఉద్దేశం?" అన్నాడు సుల్తాను బిగ్గరగా నవ్వుతూ.





"వెయ్యి దీనారాలు," అన్నాడు రైతు.

"అది చాలా ఎక్కువ," అన్నాడు సుల్తాను.

"అయిదు వందలు."

"అదీ ఎక్కువే."

"మూడు వందలు."

"అదీ ఎక్కువే."

"ఒక వంద."

"అదీ ఎక్కువే."

"యాభై."

"అదీ ఎక్కువే."

"ముప్పై."

"అదీ ఎక్కువే."

"ఆ పాపిష్ఠి మొహంవాడు దారిలో కనిపించటం నాకు చేటయింది! ముప్పై దీనారాలన్నా ఇప్పించదే. నేను దోసకాయలిచ్చేది లేదు!" అన్నాడు రైతు.

సుల్తాను నవ్వాడేగాని జవాబు చెప్పలేదు. ఇది గమనించి రైతు సుల్తాను ముఖాన్ని మరికాస్త పరీక్షగాచూసి, తనకు దారిలో గుర్రంమీద కనిపించిన మనిషి సుల్తానే అని తెలుసుకున్నాడు.

"హుజూర్, దయచేసి నాకు ముప్పై దీనారాలు వెంటనే ఇప్పించండి. లేకపోతే— నా గాడిద బయటనే కట్టేసిఉంది!" అన్నాడు రైతు.

సుల్తాను నవ్వుపట్టలేక బాలీసుపైన వెల్లికిలా పడిపోయాడు. తరవాత ఆయన తన ఖజానాదారును పిలిచి, "ఈ రైతుకు వెయ్యి దీనారాలు ఎంచి ఇయ్యి; తరవాత మరో అయిదువంద లియ్యి; ఆ తరవాత మూడువందలూ, వందా, యాభై, ముప్పై దీనారాలు వరసగా ఎంచిఇయ్యి!" అన్నాడు.

ఒక్కబస్తా దోసకాయలకు పంథొమ్మిది వందల యెనభై దీనారాలు ముట్టేసరికి ఆ రైతుకు నోట మాటరాలేదు. వాడు పట్టలేని ఆనందంతో సుల్తానుకు వెయ్యి సలాములు చేసి వెళ్లిపోయాడు.



# కన్నకడుపు

ఒకఊళ్ళో ఒక రైతుండేవాడు. అతని తల్లిదండ్రులు చాలా ముసలివారు. వారికి కళ్ళుకూడా సరిగా కనపడవు. అటువంటి అత్తమామలకు చాకిరిచేయుటం ఇష్టం లేక రైతు భార్య, వారిని ఎలాగైనా చంపేసి తనకు చాకిరీ తప్పించమని తన భర్తను బతిమాలింది.

రైతు తన భార్యమీది ఆపేక్షకొద్దీ తన ముసలి తలిదండ్రులను చంపటానికి నిశ్చయించి, వారిని ఒక బండీలో ఎక్కించి అడవికి తీసుకుపోయాడు. అక్కడ వారిని ఒకచోట దింపి, "ఇప్పుడే వస్తాను, ఇక్కడే వుండండి!" అని చెప్పి అవతలికి వెళ్ళి, నెత్తిన నల్లని ముసుగువేసుకుని దొంగలాగా నటిస్తూ, తన తలిదండ్రులపైపడి దుడ్డుకర్రతో కొట్టసాగాడు.

అప్పుడా వృద్ధులు, "నాయనా మమ్మల్ని దొంగలు చంపేస్తున్నారు! నీవైనా తప్పించుకు పారిపోయి ప్రాణం రక్షించుకోరా!" అని కేకలుపెట్టసాగారు.

తాము చచ్చిపోతూకూడా తన క్షేమమే కోరటం చూసి రైతు తన తలిదండ్రులమీద, చేయిచేసుకున్నందుకు సిగ్గుపడ్డాడు. వెంటనే తాను వచ్చి దొంగలను తరిమివేసినట్టు నటించి, తన తల్లిదండ్రుల శరీరాలు నిమురుతూ, "ఇంక ఫరవాలేదు. దొంగలను పారదోలాను! మనం ఇంటికి పోదాం పదండి!" అని వారిని బండీలో తిరిగి ఇంటికి తీసుకుపోయి ఎంతో ప్రేమగా చూడసాగాడు.





# కాజీ యుక్తి

ఒక నవాబుగారి వద్ద ఒక వజీరుండే వాడు. ఆయన ఒకనాడు ఎంతో అందగత్తె అయిన ఒక ఆడబానిసను కొన్నాడు. ఈ సంగతి నవాబుకు తెలిసింది. ఆ బానిసను స్వయంగా చూదామనే ఉద్దేశంతో నవాబు, "ఈ రాత్రికి నేను మీ ఇంటికి భోజనానికి వస్తున్నాను," అని నౌకరుద్వారా తన వజీరుకు కబురుచేశాడు.

వజీరు నవాబుగారికోసం పెద్దఎత్తున వంటకాలూ, పానీయాలూ సిద్ధం చేయించాడు. పానీయాలు అందించటానికి తన కొత్తబానిసను నియోగించాడు. ఇద్దరూ భోజనం ముగించుకుని, పానీయాలు తాగుతూ కబుర్లు చెప్పుకోసాగారు.

అకస్మాత్తుగా నవాబు "వజీర్, ఈ బానిసపిల్లను నాకు అమ్మెయ్యి. నీవు ఎంత పెట్టి కొన్నావో, అంతకు రెట్టింపు ధనం నీకు ఇస్తాను!" అన్నాడు.

"ఏలినవారు మన్నించాలి! ఈ బానిసను అమ్మే ఉద్దేశం నాకు ఎంతమాత్రమూలేదు," అన్నాడు వజీరు.

"అయితే ఈమెను నాకు బహుమానంగా ఇచ్చెయ్యి," అన్నాడు నవాబు.

"అలాంటి ఉద్దేశంకూడా నాకు ఏమాత్రమూ లేదు," అన్నాడు వజీరు నిర్మొహమాటంగా.

వజీరు ధోరణి చూసి నవాబుగారికి పట్టరాని కోపంవచ్చింది. "నువు ఈ బానిసను నాకు అమ్మటమో, బహుమానం చెయ్యటమో చెయ్యకపోయావంటే, అల్లాసాక్షిగా నేను నా పట్టపురాణికి విడాకులిచ్చేస్తాను!" అని శపథం చేశాడు నవాబు.

"నేను నా భార్యనూ పిల్లలనూ వదిలేస్తానుగాని ఈ బానిసను తమకు అమ్మనూ, ఇవ్వను! లేకపోతే నేను అల్లాకు ద్రోహం చేసినవాణ్ణే!" అన్నాడు వజీరు పట్టుదలగా.

టి. సుశీలారాణి

తీరా నేరుజారి ఘోర ప్రమాణాలు చేసేశాక, ఇద్దరికీ పశ్చాత్తాపం కలిగింది.

"ఇప్పుడేం చేసేటట్టు? మన ఇద్దరి ప్రమాణాలకూ భంగం కలగకుండా మర్యాదగా బయటపడే ఉపాయం ఏమిటి?" అన్నాడు, నవాబు.

"ఈ ఉపాయం చెప్పగలవాడు కాజీ ఒకడే! ఏలినవారి సెలవైతే ఆయనకు కబురు చేస్తాను!" అన్నాడు వజీరు.

నవాబు సరేనన్నాడు. వజీరు కాజీని పిలిపించాడు. కాజీ వచ్చి సంగతంతా తెలుసుకుని, "ఇదేమంత గొప్ప సమస్య కాదు. వజీరుగారు నవాబుగారికి సగం బానిసపిల్లను అమ్మి, మిగిలిన సగమూ బహుమానంగా ఇస్తే చిక్కు విడిపోతుంది," అని సలహా ఇచ్చాడు.

నవాబు ఈ యుక్తికి చాలా సంతోషించి, "భేష్, బాగుంది. ఇంకొక సలహాకూడా చెప్పు: ఈ పిల్లకు బానిసస్థితి పోతేనేగాని నా జనానాలో చేర్చటానికి వీలులేదు. చట్టరీత్యా ఈమె బానిసత్వం పోగొట్టటానికి చాలా తతంగం ఉంటుంది. దానికికూడా ఏదైనా సులువుమార్గం త్వరగా ఆలోచించు!" అని కాజీని అడిగాడు.

"అందుకు ఒకటే సులువుమార్గం! ఈమెను ఎవరికైనా ఇచ్చి ఇప్పుడే పెళ్లిచేస్తే



సరి! ఈమె బానిసత్వం ఈ క్షణమే పోతుంది. వెంటనే ఆ మనిషిచేత ఈమెకు విడాకులిప్పించి, ఏలినవారు ఈమెను తమ జనానాలో చేర్చుకోవచ్చు!" అన్నాడు కాజీ.

"చాలా బాగుంది. ఒక భటుణ్ణి పిలిపించు!" అన్నాడు నవాబు వజీరుతో.

వజీరు తనదగ్గిరఉన్న భటుణ్ణి ఒకణ్ణి పిలిపించాడు. అతనికి బానిసపిల్లనిచ్చి అప్పుడే పెళ్ళిచేసి కాజీ, "ఇక ఈ పిల్ల బానిసకాదు, స్వతంత్రురాలు! ఇప్పుడీమెకు ఈ భటుడి చేత విడాకులిప్పిస్తాము!" అన్నాడు.

కాని భటుడు ఇందుకు ఒప్పుకోలేదు. "నా భార్య చాలా అందగత్తె. ఆమెకు విడాకులిద్దామనే ఉద్దేశం నాకెంత మాత్రమూ లేదు!" అన్నాడు వాడు. ఎంత బెదిరించినా వాడు లొంగలేదు.

నవాబుకు మండిపోయింది. ఆయన కాజీతో, "దౌర్భాగ్యుడా, ఇదా నువు చెప్పే యుక్తి! ఈ చిక్కు విడదీయకపోయావంటే నీ తల కొట్టి కోటద్వారానికి వేళ్ళాడగడతాను!" అన్నాడు.

"ఏలినవారు తొందరపడుతున్నారు. ఈ చిక్కు ఒక లెక్కలోదికాదు. వజీరుగారు ఈ భటుణ్ణి నాకు బానిసగా ఇచ్చేస్తే అన్ని చిక్కులూ తీరిపోతాయి!" అన్నాడు కాజీ.

"ఇచ్చేశాను, తీసుకో!" అన్నాడు వజీరు.

కాజీ బానిసపిల్లకేసి తిరిగి, "ఈ భటుడు నా బానిస. వీణ్ణి నీకు బానిసగా ఇచ్చేస్తాను, పుచ్చుకుంటావా?" అని అడిగాడు.

"పుచ్చుకుంటాను!" అన్నదామె.

"ఇంకేముందీ? చట్టప్రకారం నీ బానిస నీకు భర్తకావటానికి వీలులేదు. మీ పెళ్లి రద్దయిపోయింది! నేను వచ్చిన పనికూడా అయిపోయింది!" అంటూ కాజీ లేచాడు.

నవాబు కాజీని ఆపి, "మాకు న్యాయం చెప్పి సలహా ఇచ్చినందుకు ఇదిగో బహుమానం!" అంటూ ఒక సంచీనిండా బంగారునాణాలు పోసి కాజీకి ఇప్పించాడు.



# ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

**1957 నవంబర్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు**





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ సెప్టెంబర్ నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : చేటు లేని అంబారీ

రెండవ ఫోటో : చేతగాని సవారీ

పంపినవారు :

వైడి. భాస్కరరాజు, C/o కొత్తకొండ. వీరయ్య, ఆంజనేయపేట, విజయవాడ - 1.

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# ఘాతుకమృగాలు

ఒకప్రాణి ఇంకొక ప్రాణికి ఆహారం కావటం సృష్టిలో సర్వసాధారణమైన విషయం. కొన్ని ప్రాణులు ఒకదానికొకటి ఆహారపరంపరగా ఉండటం మనం చూడవచ్చు. లేళ్ళు చెట్లను తింటాయి, లేళ్లను సింహాలూ, పులులూ తింటాయి. ఉత్తరధృవంలో సయితం ఈ ఆహార పరంపర ఉండనే వున్నది. అక్కడి మొక్కలను కీటకాలు తింటాయి, ఆ కీటకాలను మంచులో ఉండే చేపలు తింటాయి, ఆ చేపలను మంచు నక్కలు తింటాయి.

ప్రతి ఆహారపరంపరకూ ఒక చివర వృక్షజాతులుంటాయి, రెండో చివర మాంసాహారులైన ఘాతుక మృగాలుంటాయి. అయితే ఏప్రాంతంలో చూసినప్పటికీ ఘాతుకమృగాల సంఖ్య పరిమితంగానే ఉంటుంది. వాటి సంఖ్య ఆ పరిమితిని దాటి పెరిగినపక్షంలో ఆహార కొరత ఏర్పడుతుంది.

ఒక ఉదాహరణతో దీనిని అర్థంచేసుకోవచ్చు. సింహాలు, జీబ్రాలను చంపి తింటాయి. ఒక్కొక్క సింహమూ అచ్చుగా జీబ్రాలపైనే బతకాలంటే ఏడాదికి 50 జీబ్రాలు అవసరం.



కాని 50 జీబ్రాలు బతకటానికి చాలా పచ్చిగరిక అవసరం. ఆహార పరంపరలో ఎప్పుడూ ఒకరకం ప్రాణుల సంఖ్యపై మిగిలిన ప్రాణుల సంఖ్య ఆధారపడి వుంటుంది.

ఘాతుకమృగాలలో చాలా జాతులున్నాయి. వీటిలో ప్రసిద్ధమైనవి పిల్లిజాతీ, కుక్కజాతీ. సింహాలూ, కొండసింహాలూ, పెద్దపులులూ, చిరుతపులులూ మొదలైనవన్నీ పిల్లిజాతికి చెందిన ఘాతుకమృగాలు.

నక్కలూ, తోడేళ్లూ, గుంటనక్కలూ, కొయోట్‌లూ కుక్కజాతికి చెందినవి.

ఇలాగే వివిధప్రాంతాలలో వివిధజాతులకు చెందిన ఘాతుకమృగాలున్నాయి. ఎలుగుబంటి ఒక్కటీ ఒక ప్రత్యేకజాతిగా గణించబడుతున్నది.

జలచరాలలోకూడా ఘాతుకమృగాలున్నాయి. వాల్రస్, సీల్, సీ లయన్ మొదలైనవి మాంసాహారులు.

సివంగికూడా మాంసాహారే కాని అది జంతువులను తానై చంపి తినదు, ఇతర మాంసాహారులు చంపిన జంతువులను తిని, అడవిప్రాంతాన్ని "శుభ్రం" చేస్తుంది.

ఇంకా ప్రపంచంలో అనేకప్రాంతాల అనేకరకాలైన ఘాతుకమృగాలు నివసిస్తున్నాయి.





# వార్తలు-విశేషాలు

మూడేళ్లక్రితం అడవిలో దొరికి, ఆసుపత్రిలో చికిత్స పొందుతున్న 'తోడేలుపిల్లవాడు'— రాము, ఇప్పుడు మామూలు పిల్లల్లాగ తిని, ఆడుకొంటూ వున్నాడనీ, మానవలక్షణాలు అతనిలో వృద్ధిపొందుతున్నవనీ ఉత్తరప్రదేశ్ ఆరోగ్యశాఖ డిప్యూటీమంత్రి వెల్లడించాడు.

*     *     *     *

ప్రథమ భారత స్వాతంత్ర్యసమర శత వార్షికోత్సవం సందర్భంగా రాజస్తాన్‌లోని సికార్, నజీరాబాద్, నిబాహిరాన్ కోట, జేవాలలో పెద్ద ఎత్తున విజయస్తంభాలను నెలకొల్పటానికి రాజస్తాన్ ప్రభుత్వం నిశ్చయించింది. 1857 లో ఈ ఐదుచోట్ల విప్లవ సైన్యాలు అఖండ విజయాలను సాధించినవి.

*     *     *     *

ప్రధాని నెహ్రూ కంచువిగ్రహాన్ని ప్రముఖ జాపనీస్ శిల్పి యోకి తయారుచేశాడు. గత ఏప్రిల్‌లో ప్రారంభించి, ఈ సెప్టెంబరులో పూర్తిచేశాడు. ఆయన ప్రధాని నెహ్రూకు ఒక లేఖ వ్రాస్తూ, 'ప్రపంచ శాంతిసాధనకు మీరు చేస్తున్న కృషిని నేను ఎంతగానో హర్షిస్తున్నాను. ఆ లక్ష్యసాధనకే ఈ విగ్రహాన్ని తయారుచేశాను,' అని పేర్కొన్నాడు.

*     *     *     *

బొంబాయిలోని వివిధ సంఘాలు చేరి, పిల్లలకు ప్రత్యేకించి ఒక థియేటరున్ను, విద్యా రంగంలో పని చేస్తున్నవారందరి వినియోగార్థం ఒక సాంస్కృతిక కేంద్రమున్ను నిర్మించటానికి సన్నాహాలు జరుపుతున్నవి.



ఆగస్టు 7-వ తేదీన ఆంధ్రప్రదేశ్‌లో సాహిత్య ఎకాడమీ ఏర్పాటయింది. దీనికి ప్రెసిడెంట్ ప్రసాద్ ప్రారంభోత్సవం జరిపారు. దీనికి సంబంధించి, 60 మంది సభ్యులతో జనరల్ కౌన్సిల్‌కూడ యేర్పాటయింది.

*  *  *  *

హూగ్లీనది పొంగి, పడవ ప్రమాదంలో 57 మంది మరణించారు. మధ్యప్రదేశ్‌లో బేత్వా, సొండానదులు పొంగి పొరలినాయి. గండక్‌నది వరదకులోనైంది. నర్మదానదికి వరద తగలగా, 6 గ్రామాలు మునిగినై. గోదావరికూడా పొంగటంవల్ల గ్రామాలు, పడవలు మునగటం జరిగింది. ఈ నెలలో బీహార్, అస్సాం నదులకుకూడా వరదదెబ్బ తగిలింది.

*  *  *  *

తొలి పంచవర్ష ప్రణాళిక ఫలితాలను సమీక్షించటానికిగాను న్యూఢిల్లీ సభలో నివేదిక సమర్పింపబడింది. వ్యవసాయరంగంలోను, పారిశ్రామికరంగంలోను ఉత్పత్తులను పెంపొందించటానికి ఈ ప్రణాళిక విశేషంగా తోడ్పడిందనీ, దేశాన్ని సర్వతోముఖంగా అభివృద్ధి చేయటానికి అవసరమైన ఉత్సాహాన్నీ, నవచైతన్యాన్నీ, ప్రజలలో కల్గించిందనీ నివేదిక వెల్లడించింది.

*  *  *  *

గాంధీమహాత్ముని చిన్న కుమారుడు శ్రీ దేవదాస్ గాంధి ఆగస్టు 3 తేదీ తెల్లవారుజామున హృద్రోగంవల్ల హఠాత్తుగా మరణించారు. ఢిల్లీలోని ప్రముఖ దినపత్రిక "హిందుస్తాన్ టైమ్సు"కు ఈయన మేనేజింగ్ ఎడిటరు, శ్రీ సి. రాజగోపాలాచారిగారి అల్లుడు.

*  *  *  *

ఆంధ్రప్రదేశ్‌కు కొత్తగా 35 జాతీయవికాస కేంద్రాలను—అనగా నేషనల్ ఎక్స్‌టెన్షన్ సర్వీస్ బ్లాక్స్‌ను, ఇండియా ప్రభుత్వం మంజూరుచేసింది. ఈ కేంద్రాలు అక్టోబరు 2 తేదీ, గాంధి జయంతినాడు ప్రారంభింపబడుతై. వీటితో కలిపి, మొత్తం రాష్ట్రంలోని జాతీయవికాస కేంద్రాల సంఖ్య 181.



# చిత్రకథ





ఒక సెలవు రోజున దాసూ, వాసూలు మరో స్నేహితుడితో కలిసి, మామిడి తోటలోకి షికారువెళ్లారు. వెంట 'టైగర్' కూడా వుంది. ఆ ముగ్గురూ వెంట తెచ్చుకున్న టిఫిన్ తినేందుకు ఒక చోట కూచున్నారు. 'టైగర్' దగ్గిరకు వచ్చింది. కొత్త కుర్రాడు దాన్ని కసిరికొట్టాడు. కొద్దిసేపు తరవాత దగ్గిరలో వున్న ఒక పొద కదలసాగింది. ఆ ముగ్గురూ అక్కడికి వెళ్లి చూస్తే, పొదలో ఏమీలేదు. కాని, తిరిగి వాళ్లు తాము వదిలిపోయిన బిస్కట్లకోసం వచ్చేసరికి, ఆ కొత్త కుర్రవాడి బిస్కట్లన్నీ 'టైగర్' సంతోషంగా తింటూ కనిపించింది.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26—Controlling Editor: SRI 'CHAKRAPANI'




సన్‌లైట్
సబ్బు

బట్టలను తెల్లగాను, కాంతివంతముగాను ఉతుకును!

S. 249-50 TL

# గెవార్ట్‌తో తీసిన ఫోటోలు






## సంతోషం కలిగించి తీరుతాయి

ఇది గెవార్ట్ ఫిలిమ్‌తో తీసి, బహుమానము పొందిన ఫొటోగ్రాఫు. ఖరీదుగల కెమెరాయే గానీ, బాక్సు కెమెరాయేగానీ, గెవార్ట్ ఫిలిము ఉపయోగిస్తే, మీకు ఎంతో మంచి ఫలితాలు కల్గుతవి. నలుపు తెలుపు ఇన్-డోర్, ఔట్-డోర్ స్నాప్‌లకు గెవాపాన్ 33 ఎన్నికైనది. గెవాపాన్ 36 హైస్పీడ్ రోల్‌ఫిలిము వాడితే, ఫ్లాష్ అగత్యం లేకుండా ఎంత చెడ్డలైటునైనా సరి దిద్దుతుంది. ప్రకాశవంతమైన, సహజసిద్ధమైన కలర్ ఫొటోగ్రఫీ కావాలంటే, దానికి జవాబు ఎల్లప్పుడు గెవాకలర్ ఫిలిమే.




**GEVAERT**

**ALLIED PHOTOGRAPHICS PRIVATE LIMITED**

**ఎల్లయిడ్ ఫొటోగ్రాఫిక్స్ ప్రైవేట్ లిమిటెడ్**

కస్తూరి బిల్డింగ్, జంషెడ్జీటాటా రోడ్డు, బొంబాయి - 1.

## చందాదారులకు మనవి

★

పైనెల చందమామలు యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోష్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీ లోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడి వచ్చు కంప్లెయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.

మేనేజరు

Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

చేత గాని సవారీ

పంపినవారు :
పి. బి. రాజు - విజయవాడ

